


జూలై 1977

# సనాతన సారథి

# సనాతన సారథి

సత్య ధర్మ శాంతి ప్రేమల ద్వారా మానవజాతి యొక్క
సామాజిక నైతిక ఆధ్యాత్మికాభివృద్ధి కర్పితము

సంపుటము 22 జూలై 1979 సంచిక 7


## విషయానుక్రమణిక



### చందాదారులు గమనించండి!

మీ చందా గడువు ఏ నెల ఏ సంవత్సరమువరకు ఉన్నదో మీ చందా రసీదు కార్డులోను, మీకు నెల నెల పంపుచున్న పత్రిక పైనున్న విలాసము గల కాగితము లోనూ తెలుపుచున్నాము. దానినిగమనించి, ఆ నెంబరు "..../-8-1979" అనియుండిన, మీ చందా ఆగష్టు నెలలో అయిపోవునని తెలుసుకొని, క్రొత్త చందా (సం॥నకు రూ. 6) జూలై నెల 31వ తేదీ 1979 లోపల పత్రిక యొక్క కార్యాలయమునకు చేరునట్లు పంపవలెను.

### -: శ్రీవారి కార్యక్రమములు :-

బాబావారు ప్రశాంతి నిలయము నందున్నారా అని తెలిసికొన గోరు భక్తులు పబ్లిక్ రిలేషన్స్ ఆఫీస్ ప్రశాంతి నిలయము పోస్టు, పెనుకొండ తాలూకా, అనంతపురం జిల్లా అనే విలాసమునకు రిప్లయి కార్డు గానీ, రిప్లయి పెయిడ్ టెలిగ్రాం గాని పంపవలెను. లేదా కొత్తచెఱువు 36 నెంబర్‌కి ఫోన్ చేయవలెను

సంవత్సర చందా 6 రూ॥ గడువు ముగిసిపోవుటకు ముందుగనే మీ చందానంబరుతో చెల్లించవలెను.

వివరములకు అట్టలోపలి భాగములో చూడండి




శ్రీ సత్యసాయిబాబా

కర్మభూమి యని భోగభూమి అని నానా దేశములు రెండు భాగములుగా విభజించబడి అందరి ప్రజల ఆదర్శముల గూర్చియు తెలుప బడినది. అందులో భారతభూమి కర్మభూమి అనియు, కర్మ రహస్యము బాగుగా గుర్తించిన దనియు నిర్ణయింపబడినది. "వ్యాపార మంత్రం కర్మ" ఇది లౌకికమని, వైదికమని రెండు విధములు. అందులో జీవన హేతు భూతమగు కర్మ అంతయు లౌకిక మనబడును. వైదిక కర్మ శ్రౌతమని స్మార్తమని రెండు విధములు. నిత్య నైమిత్తికాదులు, స్మార్త కర్మ, సర్వ లౌకిక వైదిక కర్మలు కరణ భేదమువలన మానసిక, వాచిక, కాయికము లని త్రివిధములు. ఇవి మరీ పూర్వజన్మ కృత మని ఇహజన్మ కృతమని రెండువిధములు. దీని ఫలములే సంచిత, ఆగామి, ప్రారబ్ధము లని మూడు విధములు. ఈ జన్మయందు అను భవించినది ప్రారబ్ధము. ప్రస్తుతము చేయబడు నది ఆగామ, అనేక జన్మలనుండి సంపాదింప బడి ముందు అనుభవము కొరకు కాచుకుని నిలువ యున్నది సంచితము. ఇట్లు కర్మ తంత్రము కర్మయొక్క వ్యవహార మంతయు శ్రుతి స్మృతులు నిర్ణయించినవి. కర్మ అను పదము బహు చిన్నది. అయినప్పటికీ అర్థ బాహుళ్యమునందు అపారమైనది. యెవరికి వారి వారివారి బుద్ధి ననుసరించి ఈ కర్మము నకు అర్థమును నిర్వచించు కొనవచ్చును.

ఈ కర్మ మనో, వాకాయములను త్రికరణ ములచే కర్మ జరుగుచుండును. లౌకిక, వైదిక

పారమార్థిక విషయ సంబంధమంతయు యిందే యిమిడియున్నది. దేని కది విడదీయ వశము కాదు. ఇవి మూడునూ అవినాభావ సంబంధము గలవి. కర్మ నిరంతరం నదీ ప్రవాహమువలె సాగుచుండును. సృష్టిలోని చేతనా. అచేనము లన్నియు ఈ కర్మ ప్రవాహ వేగమునకు లోనై సంసార చక్రమున నిర్విరామముగ పరిభ్రమించుచున్నవి. కర్మ అనగా చలనమని, చలనమునకు అవకాశమైనది ఆకాశము. అందు చలించునది వాయువు, వాయు చలనమునుండి అగ్ని ఉద్భవించును. ఆ రెండింటి రాపిడివలన అగ్ని వుద్భవించునని అందరికీ తెలియును, మరియు ఉచ్ఛ్వాస, నిశ్వాసముల చలనము సాగుచున్నంతవరకు జీవుల దేహములు ఉష్ణత్వము కలిగియుండుట ఇది మరొక విదర్శనము. ఉష్ణత్వము అగ్ని లక్షణమని వేరుగ చెప్పనక్కరలేదు. అగ్నినుండి జీవము ఉద్భవించుననుటకు సూర్యతేజమునుండి కలుగు మేఘముల ఉత్పత్తి ప్రబల నిదర్శనము.

జలముయొక్క అణువులు, ఇతర భూతములు చేరికవలన ఘనీభావము చెంది పృధివి నుండి ఓషధులు జనించునను విషయము మనకు విశదమే. ఓషధుల నుండి అన్నము, అన్నము వలన తేజస్సు దానివలన పురుషుడు జనించును. ఇదంతయు సృష్టి కర్మయొక్క విధానము. ఇది శ్రుతి తాత్పర్యము.

అనగా ఇవన్నియూ చలన పరిభావము వలనను, పరిణామమువలననూ పరంపరముగా జరుగుచున్నది. ఇంత మహా చలన ప్రవాహమునకు పునాదిగా అచలవస్తువు వకటి వుండవలయును అని వేరు చెప్పనక్కరలేదు. ఇట్టి నిశ్చలమగు పరతత్త్వముననే ఆత్మ లేక పరబ్రహ్మము అందురు. పరమేశ్వరుని జ్ఞానేచ్ఛ క్రియాశక్తులే స్పందనము స్పందనమునే కర్మ అని చెప్పబడెను. సృష్టికినీ, కర్మకునూ అవినాభావ సంబంధము కలదు. ఈ కర్మ ప్రభావము వలననే బ్రహ్మ, విష్ణు, మహేశ్వర స్వరూపులు, సృష్టి స్థితి లయ కారులగుట తటస్థించు చున్నది. సమస్త గ్రహచంచలనములు తదితర లోక వ్యవహారము లన్నియు, కర్మకులోనై జరుగుచున్నవి.

కర్మకు మొదలు అనునదిలేదు. యేది, యెందులకు, యెప్పుడు, యే విధముగ జరుగబోవునను అంశము చెప్పుటకు యెవరికీ సాధ్యంకాదు. ఇదిఅనాదసిద్ధమై జరుగుచూవచ్చుచున్నవి. వక పనిచేయుట కర్మ అని చెప్పినటులనే యెట్టి పనీ చేయక వూరకుండుటయూ కర్మ అని చెప్పబడును. వూరక వున్నవారిని చూచి సామాన్యముగ మనము వారేమీ పని చేయుటలేదని అందుము. యేమియూ చేయక అతదేమి చేయుచున్నాడని తిరిగి ప్రశ్నించిన తిరిగి అదే సమాధానము అనగా అతనేమీ చేయక వూరకున్నాడని జవాబువచ్చును. వూరకుండుట అననేమి? యేమియూ చేయక మిన్నకుండుట అనగా మిన్నకుండుట అను కర్మను అతను చేయుచున్నాడని తెలియును. అందు వలన మానవుడు వకపుడు వక కర్మ చేయు

ననియు, మరొకపుడు యేమియు చేయకపోవుట అను కర్మము చేయుచున్నాడని గ్రహించవలెను.

కర్మ, అకర్మ అనునవి రెండూనూ భిన్నాభిన్నకర్మలే, అని మనము భావించవలసియుండును కర్మయందు అకర్మను, అకర్మయందు కర్మను చూడవలయును.

ఉచ్ఛ్వాస, నిశ్వాసములు, ప్రాణస్పందనము ఇది జీవితమున మొట్టమొదటి క్రియ ఇది జరుగుచుండుట చాలా ఆశ్చర్యకరము, అద్భుత విషయము తాను ఉచ్ఛ్వాస, నిశ్వాసములు చేయవలెనని యేమానవుడును సంకల్పించి చేయుట లేదు. ఈ కార్యము సంకల్ప రహితముగా జరుగుతున్నది. ఇది వక్క మానవ జీవితమునకే కాక, సర్వ జీవనరాసుల యందు అగుపించుచున్నది. సంకల్ప రహితముగ యిది యెట్లు జరుగుతున్నదనియు, సంకల్ప రహితముగ యే క్రియ యు వుండజాల దనియు మనకు సందేహము కలుగవచ్చును. సంకల్ప రహితముగ కర్మ ప్రవృత్తి జరుగదు కావున శ్వాస క్రియకు గల సంకల్పము మన దృష్టి పథమున లేదని చెప్పుట సమంజసము, అట్లు కాక ఇది సర్వ జీవరాసులకు ప్రకృతి అని సమాధాన పరచుకొన ప్రయత్నించిననూ ప్రకృతి - అననేమి అను ప్రశ్న జనించక తీరదు. ఉచ్ఛ్వాస, నిశ్వాసములు, జీవ ప్రకృతి అననేమి ? ఇవి జీవులకు సహజములు అను సమాధానము.

ఇట్టి సమాధానమును పట్టి ప్రకృతి స్వభావము నైసర్గికములను పదములకు, భావము అజ్ఞానమనినను ప్రకృతి అనినను అర్థమొక్కటే నాకు సంబంధించిన శ్వాసను గురించి నాకే తెలియలేదన్నమాట. యోగులు మనో బలమున నాడీచలనము హృదయ స్పందనముల నాపుచుండుట సంకల్పమే కర్మ ప్రవృత్తి సూచితమని మనకు గోచరింప జేయగలదు కర్మ అనగా గాలిలో నిరాధారముగ అల్లాడు విషయము కాదు. మనము కర్తలమైన గాని కర్మ వ్యవహారము బయలు దేరదు "నజాతి, యిచ్ఛతి, యతతే". ఇది న్యాయశాస్త్ర సూత్రము తన జ్ఞానము ననుసరించి కోరిక, దాని ననుసరించి కర్మచేయుట, తటస్థించును" యద్ ధ్యాయతి తత్ ఇచ్ఛతి యద్ ఇచ్ఛతి తత్ కరోతి యాత్ కరోతి తద్భవతి" ఇది వేదాంత సూత్రము మనసులో దేనిని ధ్యానించుచుండునో దానిని ఇచ్ఛగించును. ఇచ్ఛ ననుసరించి కర్మచేయును, చేసిన దానిని అనుసరించి తాను పొందుచుండును. పురుషుని వ్యక్తిత్వ స్వరూపము కామ మయము తాను కోరిన ప్రకారము సంకల్పించును. సంకల్పము ననుసరించి కర్మను చేయును, కర్మ ననుసరించి తనను సృజించుకొనును. అనగా తన బుద్ధి ననుసరించి జన్మ తెచ్చుకొనును. ఈ బుద్ధినే ప్రకృతి అనుట, కనుక ప్రకృతి తన బుద్ధి నిర్మాతయని తెలిసికొనిన అట్టి ప్రకృతినుండి విడువడుటకు మార్గములు చూచుకొన వచ్చును.

# ఓం శ్రీ సత్యసాయి
## (సత్యం, శివం, సుందరం)

1. పుట్టపర్తి యనెడి పుణ్యభూమిని బుట్టి । మానవాళితోడను మసలుచుండి
దివ్యరూప జనిత తేజోమయుండగు సత్యసాయి నెపుడు సంస్మరింతు

2. తనదు దివ్యబోధ తాదాత్మ్యమును బొందు । భక్తజనుల పాప పంకిలమును
నామ స్మరణముననె నాశనమొనరించు । సత్యసాయి నెపుడు సంస్మరింతు.

3. సత్య శివము, మరియు నిత్య సుందరమైన । దివ్యరూప విభవ దీప్తినెల్ల
దిశల పర్వఁజేసి దేదీప్యమానుడౌ । సత్యసాయి నెపుడు సంస్మరింతు.

4. అభయ హస్తముద్రి నఖిలజనంబుల । భక్తిరస పిపాసవశుల జేసి
దురితములకు చాలదూరులుగాఁ జేయు । సత్యసాయి నెపుడు సంస్మరింతు.

5. స్మరణ మాత్రముననె కరతలంబున దోచు । పూతమైన యా విభూతితోడ
సర్వరోగణాల సంహార మొనరించు । సత్యసాయి నెపుడు సంస్మరింతు.

6. పాట పాడజాల భజన సేయుదమన్న । పలుకు నేర్పులే దుపన్యసింప
గాన, మనసులోని కామాదులను వీడి । సత్యసాయి నెపుడు సంస్మరింతు.

7. దూర భూమియయ్యె చేరికొల్లు మటన్న । దర్శనంబు, పాద స్పర్శనంబు
అందరకును ప్రాప్తమౌనో ? కాదో ? యని । సత్యసాయి నెపుడు సంస్మరింతు.

8. పర్వదినములందు భక్తకోటి స్తుతింప । ఆత్మలింగ సృష్టి నమరఁజేసి,
పూర్వ పుణ్య మహిమ బొలుచు వారలకిచ్చు । సత్యసాయి నెపుడు సంస్మరింతు.

9. మానవాళి సేవ మాధవ సేవన్న । భావ మెల్లరకును పాదుకొల్ప
సకల భక్తులకును సంఘ సేవ విధించు । సత్యసాయి నెపుడు సంస్మరింతు.

10. కలియుగంబులోన కల్గునందురు ముక్తి । స్మరణ మాత్రముననె మనుజులకును,
అట్టి సూక్తి నమ్మి యంతరంగమునందు । సత్యసాయి నెపుడు సంస్మరింతు.

—కె. వి. శివరామమూర్తి

# మంచిగా వుండు - మంచిని చేయి - మంచినే చూడు - ఇదే సాక్షాత్కార మార్గం

అనేక ప్రసంగాలలో భగవాన్ శ్రీసత్యసాయి బాబా అనేకమైన బోధలు అందజేస్తారు. మంచిగా వుండు- మంచిని చేయి-మంచినే చూడు - ఇదే సాక్షాత్కార మార్గము అనేది ఒక ప్రబోధ! ఉపనిషత్తులలో మన మహర్షులు మహావాక్యాలనూ, సూత్రాలను అందించారు. ఈ సంప్రదాయంలోనే సత్యసాయి సూత్రాలు కూడా మహాశక్తిమంతమైనవిగా వుంటాయి. అఖిల మానవ సమాజ పరివర్తనం కొరకు తాను అవతరించినట్లుగా స్వామి తెలియజేశారు. అందుకై ఈ కాలానికి అనుగుణంగా భగవాన్ బాబా భాషకూ భాషకూ మధ్య భేదాలు చూడక, హృదయగత భాష ఒక్కటే అంటూ వివరించారు. అన్ని భాషలూ సాయిభాషలే! అందుచేత స్వామిచేసే ప్రబోధం సూటిగా భక్తుల హృదయాల్లో ప్రవేశిస్తుంది. స్వామి తమ సూత్ర ప్రాయమైన బోధలు కొన్నింటిని ఆంగ్లంలో చెబుతారు. ఈ సూత్రాలు చాలా నిగూఢంగావుంటూ క్లుప్తంగా స్వామి సందేశ సారాన్ని అందిస్తాయి! వీటికిగల అపారమూ అగాధమూ అయిన అర్థాన్ని గమనిస్తేనే వీటి పూర్తి ప్రయోజనం మనకు లభించేది! వేదాంత మహావాక్య సదృశములైన ఈ సూత్రాలను చిలుక పలుకులవలె వల్లించుతూ వీటి పరమార్థాన్ని విస్మరిస్తే సాధకులు తమ సాధనలో ప్రమాదాన్ని ఎదుర్కొంటారు. ఈ సూత్రాలను అట్టలమీద వ్రాసి భజన మందిరాల్లో ప్రదర్శించుతూ వాటి సారాంశాన్ని విస్మరించుతారు. ఉపనిషత్తులలోగల మహా వాక్యాలనూ, సూత్రాలనూ మహర్షులు ఎంతో గాఢంగా ధ్యానించి, వానికిగల పరమార్థాన్ని పామరులకు వివరించుటకై మహత్తరములైన భాష్యరచనలు చేశారు. బాబావారి దివ్య ప్రబోధ సూత్రాలను కూడా ఇదే రీతిగా మనం ఈనాడు తెలుసుకోవాలి. లేకపోతే వాటికిగల లోతులు తెలియవు. ఇందుకై బాబావారినుంచి శ్రవణం చేయుట. మననం చేయుట. నిధి ధ్యానము ద్వారా వీటిని మన జీవిత విధానానికీ, సాధనకూ అనువుగా అవగాహన చేసుకోవటం చాలా అవసరం.

అలా అంతర్విచారణ చేసినప్పుడు ఈ సూత్రాలకు గల విస్తృతి చాలా వుంటుందని తెలుస్తుంది. దీనినే మనం ప్రస్తుతం పరిశీలించుదాం. "మంచిగా వుండు, మంచిని చేయి, మంచినేచూడు-ఇదే భగవత్ సాక్షాత్కారానికి మార్గం, అనే సూత్రంలో "మంచి" అనేది కీలక ప్రాయమైన పదం. ఈ పదానికి ముందుగా అర్థం తెలుసుకోవాలి. ఆలోచించి చూస్తే ఈ పదానికిగల అర్థం కనిపించినంత సామాన్యమైనది కాదని తెలుస్తుంది. ఆంగ్ల నిఘంటువులో 'మంచి' (Good) అనే పదానికి ఎలాటి నిర్వచనాలు చేసేరో చూడండి. (1) నైతికమైన విశిష్టత; ఉదాహరణకు. మంచి మనిషి (2) సంతృప్తికరమైన ప్రామాణికత. ఉదాహరణకు మంచి పుస్తకం (3) సన్నిహితత్వం : ఉదాహరణకు మంచి స్నేహితుడు. (4) ఉత్తమ

ప్రవర్తన : ఉదాహరణకు మంచి అధికారి. (6) నేర్పరితనం, సమర్థత. ఉదాహరణకు మంచి అధికారి. ఈ రీతిగా మంచి అనే పదం వెనుక విడదీయలేని రీతిగా ఎంతో నైతికమైన ప్రాతిపదిక వుంది. దీనికి వ్యతిరేకపదం "చెడు." "చెడు" అనే ఈ పదంలో పైన చెప్పిన నైతికధర్మాలు లేకపోవటం, అవిధేయత దుష్టత, అసత్ప్రివర్తన వంటి అర్థాలూ వున్నాయి. "మంచి"ని గూర్చి తెలుసుకోవాలంటే ముందుగా చెడు లక్షణాలు కూడా తెలుసుకోవాలికదా ! ఇలా చేస్తే మంచినిచెడునూ విమర్శించి చూసేవివేకం మనలో అలవడుతుంది. నిజానికి సాధనలో తొలిమెట్టు మన లోని మలిన సంస్కారాలను తుడిచి వేసుకోవటమే. సంస్కారాలే మన ప్రవర్తనలో మంచికీ చెడుకూ మూల కారణాలు !

బాబావారు రామకథా రసవాహినిలో ఈ మంచి, చెడు సంస్కారములను గూర్చి వివరిస్తారు. భరతుడు అడిగిన ప్రశ్నకు శ్రీరాముడు సమాధానం చెబుతాడు. "తమ్ముడూ ! మంచితనాన్ని సూచించే లక్షణాలు లెక్కకు మిక్కుటములని వేదములూ పురాణములూ ప్రవచిస్తాయి. ఒక మంచి గంధం చెట్టునూ, దాన్ని కొట్టివేసే గొడ్డలికీ ఎంత అంతరం వుందో అంత అంతరం వుంది మంచికీ, చెడుకూ, తనను ఖండించే గొడ్డలికి కూడా తనకు గల సుగంధాన్నిస్తుంది మంచి గంధం చెట్టు. తనను పతనంచేసే గొడ్డలికి ఉపకారం చేస్తుంది గంధం చెట్టు, కనుక గంధపుచెట్టును అందరూ శ్లాఘిస్తారు. దుర్మార్గులు మంచివారిని బాధపెడుతారు, అయినప్పటికీ దుర్మార్గులకు ఉపకారమే చేస్తారు మంచివారు. అందువల్ల మంచివారికి ఏం లాభం ? అంటారేమో. దానివల్ల వారికి సద్గతి లభిస్తుంది. వారు నిరంతరం ఆనందంతో జీవిస్తారు. అందుకు భిన్నంగా దుర్మార్గులు ఎల్లప్పుడూ వేదనతో విచారంతో కుమిలిపోతూనే వుంటారు. నరక యాతనలన్నీ అనుభవిస్తారు. చూచేవారికి వారు సుఖంగా వుంటున్నట్లు కనిపించినా వారు పొందే అపకీర్తి, వారు పొందే తిరస్కారభావం వారిని లోలోపల చిత్రవధ చేస్తాయి !

మంచివాళ్ళ లక్షణాలను చెబుతాను. వారికి యింద్రియ సుఖాలపైన వ్యామోహం వుండదు. వారు సద్గుణ సంపన్నులు. ఇతరులు సుఖపడుతూ వుంటే వారు సుఖపడతారు. ఇతరులు దుఃఖిస్తే వారూ దుఃఖిస్తారు. అందరినీ వారు సమానంగా ప్రేమిస్తారు. వారికి విరోధులు లేరు. వారిని ద్వేషించే వారున్నా పట్టించుకోరు. వారికి ఆధ్యాత్మిక జ్ఞానం, లౌకిక జ్ఞానం రెండూ వుంటాయి. వారు నిస్సంగులు. వారిది సుకుమార హృదయం. బలహీనుల యెడ, అసహాయుల యెడ వారు దయాప్రపూర్ణులు. మనో వాక్కాయ కర్మలతో వారు నన్ను అర్చించుతారు. నా సేవలో ఆనందిస్తారు. కీర్తి అపకీర్తులయెడ, నిందా స్తుతుల యెడ వారికి దృష్టి వుండదు, ఎల్లప్పుడు వారు యితరులకు సేవచేస్తూనే వుంటారు. స్వార్థ ప్రేరణకు వారు కలలోకూడా లోనుగారు. వారిచేతలన్నీ సరళంగా వుంటాయి. వారు ప్రశాంత హృదయులు. వారికి ఆందోళనలు కలుగవు. ఎల్లప్పుడు త్యాగం చేయటంకోసం సంసిద్ధులై వుంటారు. వారికి పొగడ్తలు తెగడ్తలూ ఒకటే. తమ్ముడూ ! ఎవరిలో ఈ సుగుణములు వుంటాయో అతడు నా ధర్మాన్ని కలిగి వుంటాడు. అంతేకాదు. అతడే నేనై నేనే అతడై ఉంటాము. ఇది యథార్థం.

"ఇప్పుడు చెడ్డవాళ్ళను గూర్చి చెబుతాను. నీవు దుష్టుల సహవాసం ఎప్పుడూ విసర్జించాలి. వారితో నీవు సఖ్యంచేస్తే నీవూ దుఃఖ భాజనుడవౌతావు. ఇతరుల భాగ్యములను చూచి దుష్టులు బాధపడుతూ వుంటారు. పరులను దూషించుటలోనే వారికి ఆనందం. అలా దూషించటంలో వారికి ఐశ్వర్యం లభించినట్లుగా

వుంటుంది. అరిషడ్వర్గాలు వారిచే పోషింపబడుతూ వుంటాయి. వారు అరిషడ్వర్గాలయిన కామక్రోధ లోభ మోహ మద మాత్సర్యాల అధీనంలో వుంటారు. పవిత్రత, దానగుణమూ వీరిలో వుండవు. అకారణంగా యితరులతోటి కలహిస్తారు. ఉపకారం చేసిన వారికి కూడా అపకారం చేస్తారు. వారు అసత్య వర్తనులు. వారి సంభాషణ అసత్యాలతో నిండి వుంటుంది. ఇచ్చి పుచ్చుకోవటంలోనూ వారు అసత్య పరులే. వారి దృష్టి కఠినంగా వుంటుంది. వారివి రాతి గుండెలు. నెమిలి అందంగా వుంటుంది. శ్రావ్యంగా కూస్తుంది. కానీ దాని పని పాములను చంపటం, అలాగే దుర్మార్గులు ఇతరులకు కీడు కలిగిస్తూ వుంటారు. వారు పరదారాభిలాషులు, ఇతరులను అప్రతిష్ఠ పాలుచేయాలని చూస్తారు. కీడు కలిగించటంలో ఘనులు. సర్వకాలసర్వావస్థలలోనూ వారు దుర్మార్గులే. వారు మానవాధములు, వారికి పాపభీతిలేదు. ఇతరులు బాగుపడుతూవుంటే వారికి తలనొప్పి, ఇతరులు ఆపదల్లో వుంటే వారికి ఆనందము. వారు అహంభావపూరితులు. కలలో కూడ ఇతరులకు ఉపకారం తలపెట్టరు. వారి హృదయం కామక్రోధాదులకు నిలయం. తల్లిదండ్రుల యెడ, సత్పురుషుల యెడ దేవునియెడ వారికి ఆదరణ భావం లేదు."

ఈ రీతిగా శ్రీరాముని నోటినుంచి మంచి వారి లక్షణాలనూ, దుర్మార్గుల లక్షణాలనూ వినిపించు తారు స్వామి. ఈదృష్టిలో స్వామి చెప్పిన సూత్రాన్ని గూర్చి విచారించాలి! "వుండు," "చేయి," "చూడు" అనే క్రియాపదాల వెనుకగల అర్థాన్ని తెలుసుకుందాం. వుండుట అనగా జీవించుట. మంచి అనే మాటకు నిర్వచనం నిఘంటువు లోనే మిగిలిపోతే చాలదు. సాధారణంగా చెడ్డవారివల్ల మనకు కీడు కలుగుతుందనే భయంతో మనం వారిజోలికి పోము. మనం మంచివారి మంచితనాన్ని మన స్వార్థంకొరకు వాడుకుంటాం. అంతమాత్రాన మనమూ మంచివాళ్ళం కాము. బాబా చెప్పినట్లుగా మనం మంచి లక్షణాలు కలిగిన మానవుల ముగా జీవించాలి. ఈ మంచితనం మన జీవితం వరకూ వుండాలని శ్రీ రామచంద్రుని మాటలవలన తెలుస్తుంది. మనలోని చెడు లక్షణాలన్నీ నశించాలి. వాటిస్థానంలో మంచి లక్షణాలు రావాలి. దీనికి సాధన అవసరం. అప్పుడే మన మనస్సు దుర్మార్గంవైపు పోదు.

తర్వాత 'మంచిని చేయటం', మన పనుల్లో మంచి తనం చూపించాలి. ఒకసారి మంచి లక్షణాలేవో తెలుసుకొని వాటిని ఆచరణలోకి తేవాలి. మంచిని చేయటం చేతకాక పోతే కనీసం చెడును చేయటం మానుకోవాలి, అంటారు బాబా! ఈ రీతిగా క్రమంగా మంచిని చేయటం మన అలవాటవుతుంది. మంచిని చేయటంలోనే ఆనందమూ లభిస్తుంది. ప్రతి మంచి పనిలోనూ సంతృప్తి కలుగుతుంది. ఈ రీతిగా స్వార్థ త్యాగం ఆత్మానందాన్ని అందిస్తుంది!

సూత్రంలోని తర్వాత భాగం 'మంచిని చూడు'. ఈ వాక్యం కొంచెం తికమక పెడుతుంది. ఒక వ్యక్తి చెడ్డవాడు. అతడు చేసే పనుల్లో ఈ సూత్రం ప్రకారం మంచిని ఎలాచూస్తాం? శ్రీరామచంద్రుడు చెప్పినట్లుగా చెడ్డవారి స్నేహాన్ని కూడా విసర్జించాలి కదా! వారి స్నేహాన్ని విసర్జించుతూ వారి పనుల్లో మంచిని చూడటం ఎలా? వారిలో మంచిని చూస్తే వారి స్నేహం విడనాడటం ఎందుకు? ఇలా అనిపించుతుంది!

అయితే దీని అంతరార్థం యిలా వుంటుంది. మనలో చెడు భావాలుంటేనే యితరుల్లోనూ చెడు చూస్తాం. నిజానికి మనం చూసే మంచి చెడ్డలు మన మనస్సులలో వున్నట్టివే! మన దృష్టిలో చెడు వుంటే అందరిలోనూ చెడు కనిపించుతుంది. ఏది కావాలని

అనుకుంటామో అదే అవుతాం. "యద్భావం తద్భవతి". మన భావాలే మన అనుభవంలోకి వస్తాయి. మన మనస్సులోని ఆలోచనల రంగులతోనే సంఘటనల్లోని మంచినీ చెడునూ నిర్ణయించుకుంటాం. అందువల్లనే ఒకసారి ఒకవ్యక్తి మనకు యిష్టుడయితే, అతడే మరోసారి అయిష్టుడు అవుతాడు.

ఇదంతా మనోవిలాసకల్పితం అని గుర్తిస్తే చాలు. ఆ మీదట మనకు యిష్టం లేనివారిలో కూడా కొన్ని మంచి గుణాలు చూడ గలుగుతాం. తెలిసిగానీ తెలియక గానీ ఒకవ్యక్తి మన అహంభావాన్ని కొద్దిగా దెబ్బతీస్తాడు. ఈ దెబ్బతిన్న అహంభావమే ఆ వ్యక్తిని చెడ్డ మనిషిగా చిత్రిస్తుంది. మనలో ఆధ్యాత్మిక భావాలు జాగృతం అయిననాడు క్షమా గుణం అలవరచుకుంటాం! ఎవరైనా చెడ్డపని చేసినా, ఏవో గ్రహచ్ఛిద్రాల వల్లనో, ఏదో ఆపదవల్లనో, ఏదో సమస్యచేతనో అతడు అలా ప్రవర్తించి వుంటాడని సహనం వహిస్తాం. స్వామి చెప్పిన సూత్రంలోని ఈ భాగం తెలుసుకుంటే ఇతరుల్లోని మంచినే మనం చూడగలం.

నిజానికి ఎవ్వరూ ఎల్లకాలమూ మంచి వారు కారు. చెడ్డవారు కారు. మంచిని చేయాలన్నా, మంచిని చూడాలన్నా మనలో ప్రేమ భావం జనించాలి. మన పిల్లలు పొరపాటు చేస్తే మనం ఉపేక్షవహించి వూరు కుంటాం. అదేపొరపాటు ఇతరులు చేస్తే వూరుకో లేము. దీనికి కారణం? మన పిల్లల్ని మనం ప్రేమిస్తాం. ఈ ప్రేమ వల్లనే వారు చేసిన పొర పాటు పనిని తీవ్రంగా తీసుకోము. ఇతరుల యందు కూడా ఈ ప్రేమ భావననే పొందగలిగితే వారియందు క్షమా భావాన్ని కూడా మనం పొందగలము. వారిని సంస్కరింపవలెనన్న ప్రయత్నం వల్ల వారియందు సదవగాహన కలిగి, వారిని ప్రభావపరుస్తుంది! లేక పోతే చేసిన పొరపాటును సమర్థించుకోవాలని వారూ ప్రయత్నిస్తారు!

కాలక్రమేణ మంచీ చెడు అనేవి సాపేక్ష పదాలని మనకు తెలుస్తుంది. ఒక సమయంలో మంచి మరొక సమయంలో చెడుగా కనిపించుతుంది. అందుచేత మంచికీ చెడుకూ అతీతంగా పోయినప్పుడే మనకు మనశ్శాంతి. అలాటి వ్యక్తి ఎల్లకాలములలోనూ మంచివాడుగానే వుంటాడు. "సతతం యోగినః" అంటూ వుంటారు. తరచుగా బాబా. సర్వకాలముల లోనూ వారు సమచిత్తులై వుంటారు ఒక్కసారి ఈ స్థితి కలిగితే చాలు. అట్టి వ్యక్తి అందరిలోనూ దివ్య దీప్తిని చూడగలడు. అజ్ఞానం, కోపం, అసూయ, లోభము వంటి గుణములు ఆవరించిన వ్యక్తులలో కూడా అతడు దివ్యజ్యోతిని సందర్శించ గలడు!

అలాంటి స్థితిలో అతనిని చెడ్డ వాళ్లు కూడా ప్రభావ పరచ లేరు. బాబా తరచు మనకు జ్ఞాపకం చేస్తూ వుంటారు— భగవంతుడు ఎక్కడో దూరంగా నివసించే వ్యక్తి కాదని! భగవంతుడు సర్వాంతర్యామి! మంచిగా వుంటూ, మంచిని చేసి, మంచినే చూస్తుంటే మనలను ఆవరించిన తెర అదే విడిపోతుంది. లోన లోపల ఎల్లప్పుడూ అధివసించే అంతర్యామి మన ఎదుట సాక్షాత్కరిస్తాడు. అదే భగవత్ సాక్షాత్కారానికి మార్గం" అని బాబా చెప్పటంలోని అర్థం యిదే! అహం అనే పొరను చీల్చి వేస్తే మనకు లోపలా వెలు పలా కూడా దైవసందర్శనం అవుతుంది. అదే విముక్తి, మోక్షం! అదే పరమాత్మతో కలయిక! ఈ మహా వాక్యమునకు గల విశిష్టత యింతటిది.

ఒక సాధకుడు

# బహు దూరమైనా కడు చేరువ

అది చాలా దూరము; అది చాలా సమీపము (ఈశోపనిషత్) అతడు ఎంత దూరములో ఉన్నాడో అంత చేరువలో ఉన్నాడు. (భగవద్గీత) దేవునిలో మనకు అచంచలమైన విశ్వాసముంది. అయితే భగవంతుని అస్తిత్వం గురించి మనం ఏమాత్రము ఆలోచించడంలేదు. భగవంతుడు ఈ ప్రపంచానికి సృష్టి కర్త. ఈ సకల చరాచర ప్రపంచానికి అధిపతి. సర్వత్ర వ్యాపించి యున్న నిత్య సత్యమైన భగవత్తత్వాన్ని తెలుసుకోడానికి అశక్తులమై భగవంతుడున్నాడా ? అనే ప్రశ్నను ఎదుర్కొంటున్నాము.

ఈ ప్రశ్నకు జవాబు చాలా తక్కువమంది తెలుసుకున్నారు. తెలుసుకున్నవారు కూడా వర్ణించుటకు శక్తి లేక వారి వారి స్థాయిలలో వారి వారి భాషలో అందివ్వడానికి ప్రయత్నించారు. ప్రహ్లాదుని గంభీర వాక్యములను పునశ్చరణ చేసికొంటే భగవంతుడు సర్వత్ర వ్యాపించియున్నాడు అని తెలుసుకొనగలము. ఆగ్రహంతో ఉన్న తండ్రికి స్థంభంలో భగవంతుడు వున్నాడు అని నిస్సందేహంగా ఒక్క ప్రహ్లాదుడే అనగలిగాడు. మానవుడు భగవంతుని దర్శించడానికి తిరుపతి, కాశీ, పూరీ వంటి క్షేత్రాలకు వెళ్తున్నాడు. తీర్థయాత్రలు సేవిస్తున్నాడు. మనశ్శాంతికై హరిద్వారము, బదరీనాథ్, హృషీకేశ్, మధుర, ద్వారక వంటి క్షేత్రాలకు ప్రయాణం సల్పుతున్నాడు. కొంత మంది తమ గృహములలోనే పూజా మందిరమందు భగవంతునికి కన్నీళ్ళతో, వ్యాకులమైన మనస్సులతో తమ బాధలను వెళ్ళబోసుకొని జీవిత సమరాన్ని ఎదుర్కొనే శక్తిని ప్రసాదించమని వేడుకుంటారు. మానవులు భగవంతుని కొరకు అనేక విధములుగా అన్వేషిస్తున్నారు.

ఈ యుగంలో వెలసిన అవతారమూర్తి భగవాన్ బాబా మనకు స్పష్టంగా వ్యక్తం చేస్తున్న సత్యం, "భగవంతుడు స్వర్గంలో కాని, కైలాసంలో కాని, వైకుంఠంలో కాని లేడు. భగవంతుడు ఏదో ఒక ప్రదేశంలో ఉన్నాడు అనుకొని అక్కడకు ప్రయాణం చేయడం అనే మూఢ నమ్మకాన్ని దూరం చేసుకోవాలి. భగవంతుడు సర్వత్రా, సర్వదా, సర్వకాలేషు ఉంటున్నాడు. అంతర్యామిగా వుండి అన్నిటినీ గమనిస్తుంటాడు." అని, కరుణా సముద్రుడైన భగవాన్ బాబా ఈ విధంగా ప్రకటించినప్పుడు మన సందేహాలన్నీ పటాపంచలై పోతాయి. స్వర్గాధిపత్యం లభించినట్లు ఆనందిస్తాము. కానీ భగవానుని సన్నిధికి దూరమై మన నివాసములకు చేరినపుడు ప్రారబ్ధ కర్మ వలన దేవు డెక్కడున్నాడు ? సుఖ మంటే ఏమిటి ? మన గమ్య మేమిటి ? అని అనేకరకములుగా సందేహములు చుట్టుముట్టుతాయి.

మీరు నన్ను అపార్థం చేసుకోకుండా వుండటానికి ఒక విషయం చెప్పదలచుకున్నాను. మానవుని ఆధ్యాత్మిక అభివృద్ధికి పుణ్య క్షేత్రాల వలన ఫలితం లేక పోలేదు. మానవుని దృష్టిని దేవుని వైపు త్రిప్పడానికి ఆధ్యాత్మిక పరిణామానికి తోడ్పడే వాటిని అనవసర మని అనలేము. దేవుని కొరకు అన్వేషించుట ఒక ప్రదేశానికి పరిమితమైనచో అది నిరర్థకం. దేవుడెక్క

డున్నాడు ? అనే ప్రశ్నకు సమాధానం తెలుసుకో కుండానే మన అన్వేషణను ముగించవలసి వస్తుంది.

ఉపనిషత్తులలో పరమాత్మ కడు దూరములో వున్నాడనీ, అందుకోవాలని పరుగెత్తే వారిని అధిగ మించగలడని చెప్పబడింది. ఇటువంటి ఉపనిషద్వాక్యములకు ఎంతో అర్థముంది. మానవుని దృష్టి దేశ కాలాతీతమైన వస్తువులను గానీ, సంఘటనలను గానీ నిర్వచింపగలది కాదు. దూరమును, కాలములను (Space and time) మనస్సు సృష్టించినవే. అవి స్వతస్సిద్ధమైనవి, వాస్తవమైనవి కావు. అనుభవ రూపమైనవి. ప్రాపంచిక జీవితానికి, ఇంద్రియాలకూ చేరువ కానిది, మేధా శక్తికి, అవగాహనకు లొంగనిది అయిన నిత్యత్వమునకు భిన్నమైనది వేరేమున్నది ?

దేవుడు దూరములో వున్నాడా ? అతని వద్దకు చేరడానికి ఎంతదూరం పోవాలి ? ఆధ్యాత్మిక పరిణామానికి ఋషులు, సాధకులు కఠినమైన క్రమశిక్షణను ఎందుకు కావాలన్నారు ? ఆ క్రమ శిక్షణ ఈ జన్మలోనేకాక అనేక జన్మలలో కూడ పాటింపబడాలనడానికి కారణ మేమిటి ? వ్యక్తుల యొక్క అంతర్గత స్వభావములను బట్టి, మేధాశక్తిని బట్టి సామర్థ్యమును బట్టి పెక్కు ప్రత్యామ్నాయ మార్గాలను శాస్త్రాలు ఎందుకు నిర్దేశించాయి ? జ్ఞాన, భక్తి, నిష్కామకర్మ మొదలయిన అనేక మార్గాలు ఎందుకు ఏర్పడినవి ? మానవుడు చేరవలసిన గమ్యం చాలా దూరంలో ఉన్నదని ఇవి స్థిరపరుస్తున్నాయి. "ఎవరి కొరకు" అనే ప్రశ్న ఎవరికి అంతుపట్టుటలేదు. ఆచార్య శంకరులు మొదటి సూత్రానికి భాష్యం వ్రాసినట్లు అది దూరమైనది. ఎందువలనంటే జ్ఞానులు కానివారు అనేక లక్షల సంవత్సరాలకు కూడ దానిని చేరలేరు." కనుక అజ్ఞానులమైన మనము జ్ఞానులమని చెప్పుకొనగలమా!

మనలను సన్మార్గంలో నడిపి, సరియైన దిక్కును చూపించి, దూరమెంతయిననూ, లక్ష్యమును చేర్చే జ్ఞానాన్ని ఎట్లు పొందగలము ? ప్రతి సమస్యకూ పరిష్కారమార్గాన్ని సూచించగల శాస్త్రాలు ఈ జ్ఞానాన్ని కూడా ప్రసాదించగలదని మనం ఆశిస్తాము. కానీ మన విజ్ఞానం కేవలము ప్రాపంచిక విషయాలతో పెనవేసుకునిపోయింది. మన ఆలోచనలన్నీ ప్రాపంచిక విషయ ధోరణిలో సాగుతున్నవి. జీవిత సమస్యల పరిష్కారం మాట అటుంచి, అసలు విజ్ఞానాన్ని అందించగల మరొక మార్గాన్ని, సాధనాన్ని మన మేధస్సు కనుగొనలేకపోయింది.

శాస్త్రాభివృద్ధి సాంకేతిక జ్ఞానాభివృద్ధి ప్రజల సమస్యలను తీర్చి భూతల స్వర్గాన్ని సృష్టించగలదని ప్రపంచం వృథాగా ఆశించింది. అలా జరగకపోగా, అది మానవుని నైతిక మార్గానికి మళ్ళించ లేకపోయింది. మానవుని పశు ప్రవృత్తిని అరికట్ట లేకపోయింది. భౌతికమైన ప్రయోజనాలు మానవునికి సత్యమైన, నిత్యమైన సుఖాన్ని అందించలేవు. విజ్ఞాన శాస్త్రం మనకూ ఇతరగ్రహాలకు మధ్యగల దూరమును చెప్పవచ్చు కానీ మన బుద్ధిని ప్రకాశింపచేసే, చైతన్య స్వరూపమైన అంతరాత్మ మనకు ఎంత సన్నిహితంగా ఉందో, చెప్పటం మాట అటుంచి అసలు చేరువలో ఉన్నదా ? దూరముగా ఉన్నదా అనే విషయాన్ని కూడ చెప్పలేదు.

మనం చేరవలసిన నిత్య సత్య స్వరూపం దూరంలో ఉందా ? చేరువలో ఉందా ? దానిని చేరాలంటే ఎంత కాల వ్యవధి పడుతుంది? ఏ వాహనంద్వారా దానిని చేరుకోవచ్చు? అనే విషయాలను నిర్ణయించటానికి మనం శాస్త్రీయమైన భౌతిక సంబంధమైన ప్రమాణాల మీద ఆధార పడటం పూర్తిగా మానివేయాలి అత్యద్భుతమైన ఈ విషయాన్ని స్పష్టంచేయగలశక్తి మానవ విజ్ఞానానికి కానీ మానవుని మేధాశక్తికిగాని లేదు. వాగు మట్టము దాని మూలము యొక్క మట్టాన్ని మించలేదు కదా !

కాల దూర వ్యాపస్థీకరణలో మానవుడు చేరగల అన్ని శిఖరాలకంటే అతని లక్ష్యం చాలా ఉన్నత మైన శిఖరంగా భావించుట సబబే. సృష్టిలో ఈ నాటి మానవుడు అత్యున్నత స్థాయిలో ఉండుట నిజమేనని అంగీకరించక తప్పదు. మానవుడు ఇతర జీవరాసుల వలె, ఆయా నియమాలకు లోబడ నవసరం లేదు. అతడు జంతు ప్రకృతికి అతీతుడు, శారీరక వాంఛ లకు లొంగవచ్చును. లేదా ఉన్నతమయిన నైతిక ఆధ్యాత్మిక స్థాయిలనందుకొనవచ్చును పరిణామ క్రమంలో మానవుడు జంతుస్థాయికన్న ఎక్కువ స్థాయిలో ఉన్నాడు. జంతువులు స్వయోచనతో నిర్ణ యాలు తీసుకొనలేవు. కానీ మానవుడు తలచుకుంటే ఎంతటి ఉన్నత స్థాయి నైనా అందుకోవచ్చు. తనకు సహజ స్వభావమైన దైవత్వమునే సాధించవచ్చు. దైవ సామ్రాజ్యం అతనిలోనే ఉంది. (**The kingdom of god is in him**) అతడు దానిని అందు కొనగలడనే ఆధ్యాత్మిక సత్యం క్రైస్తవ మతం అంది స్తున్నవి. ఆ స్థితి ఆనందాన్నే కాదు ఆత్మసాక్షాత్కా రాన్ని అందిస్తుంది.

వివిధమతాలవారు విభిన్నరీతులలో భగవతత్త్వాన్ని వివరించవచ్చు. అయితే అన్నింటిసారాంశం ఒక్కటే. వివరించటంలో గల విభిన్నత్వం వివిధ మతాల రీతు లలో వ్యత్యాసం ఉండటానికి హేతువు కావచ్చు. పాశ్చాత్య తత్త్వ శాస్త్ర ప్రకారం దేవుడంటే మనలను ఆకర్షించి, తన ఘనత వలన, మన భక్తి తాత్పర్య ములను చూరగొనగల అత్యున్నత భక్తి ప్రపత్తులకు నెలవైనవాడు. మానవుని ఆశయాలకు స్థానం. కష్ట సమయంలో ఆదుకునే అండ. కానీ భారతీయ తత్త్వ శాస్త్రం భగవంతుని తమతమ ఇష్టానుసారం గ్రహించే స్వతంత్రతను, వివిధత్వములో ఏకత్వమును పేర్కొం టుంటే వేదాంతము (ముఖ్యంగా ఉపనిషత్తులు) మరియు భగవద్గీత పరమాత్మ అవగాహనకు ఎంతో తోడ్పడతాయి. మానవుని ఆధ్యాత్మిక పరిణామానికి భారతీయ తత్త్వ జ్ఞానం చూపిన మార్గము అందించిన తోడ్పాటును కృతజ్ఞతతో పేర్కొనుటకు పాశ్చాత్య తత్త్వ వేత్తలు సందేహించలేదు.

పరమాత్ముడు మనలోనే ఆత్మస్వరూపంగ ఉండి, అహంకారము అవల ఉంటున్నాడు. మనలోనే దైవ మున్నాడు. ఆయన మానవులలోని అంతర్గత భాగం. అదే ఆత్మ. అదే అతని వ్యక్తిత్వంలోని సారాంశం. ఈ విశ్వాన్ని సృష్టించిన దేవుడే సర్వాంతర్యామియై దానిని పరిపోషించును. ఈ బ్రహ్మాండము అనేది దాని వెలుపల కూడ నిండి ఉన్న అనంత విశ్వముయొక్క స్వరూపములో ఒక్క భాగం మాత్రమే. "నాలోని ఒక స్వల్ప భాగంతో విశ్వమంతట సర్వాంతర్యామినై దానిని కాపాడుచుందును." (గీత **X-42**) అంతర్గత ఆత్మలకు సంబంధించి భగవానుడు సెలవిచ్చేదేమంటే "ఓ అర్జునా! అన్ని జీవులహృదయాలలో భగవంతు డుంటాడు. అవి యంత్రంమీదికెక్కించబడినట్లు కదిలే టట్లు తన శక్తిచే చేస్తాడు." (గీత **XVIII-61**) "అన్నింటిలోని మిక్కిలి అంతర్గత భాగమది" అంటుంది కేనోపనిషత్. "శరీరం మధ్యలో బొటన వ్రేలి పరిణామంలో ఉండేవాడు. అతడు గత భవిష్యత్ కాలాలకు కర్త" అటువంటి కఠోపనిషత్. ప్రమాణమును గూర్చి మనము అనవసరమైన ప్రాము ఖ్యత ఇవ్వవద్దు. ఈ దిగువ రీతిని పేర్కొని ఆచార్య శంకరులు సందేహమున కాస్కారము లేకుండా చేసి నారు. "బొటన వ్రేలి ప్రమాణం అనేది మనస్సుతో ప్రభావితమై హృదయంలోని కాళీ స్థలంద్వారా గోచ రించే ఆత్మను గూర్చి ప్రస్తావిస్తున్నది. ధ్యానం నిమిత్తమే అది అట్లు భావింపబడింది. వాస్తవానికి ఆత్మ అంటే వేని వలన ఈ విశ్వము నిండినదో ఆ పురుషుడే.

మన ఉనికిలో బహు అంతర్గత భాగమైన పరమాత్మయే మనకు మిక్కిలి దగ్గరలో ఉన్నాడు. అయితే మాయలోపడి, తద్వారా కలిగిన అజ్ఞానంలో చిక్కుకొని, కేవలము భౌతిక ప్రపంచములోనే ఉంటున్నాము. మన జ్ఞానేంద్రియాలు సుఖమునివ్వగల ఒక వస్తువునుండి మరొకదానికి పర్యటిస్తుంటాయి. తద్వారా ఉనికియొక్క అంతర్గత భాగమునకు మనం దూరమై సంసార బంధాలలో మరింత చిక్కుకొని పోవటం జరుగుతుంది. వివేక చూడామణిలో ఒక శ్లోకంలో ఆచార్యుడు ఈ క్రింది విధంగా వర్ణిస్తాడు: "శిథిలమయ్యే శరీరంతో ఐక్యమైపోయి దానికి తిండి పెట్టి స్నానం చేయించి, జ్ఞానేంద్రియగోచరమైన వస్తువులతో పోషిస్తాడు. తన దారాలతోనే తయారైన దాని లోపల బంధింపబడిన పట్టుపురుగువలె మానవుడు బంధితుడవుతాడు."

ఈ విధంగా ఐక్యం కావడం అవాంఛనీయం. తాను పరిపూర్ణ బ్రహ్మనని మానవుడు గ్రహించగలగాలి. దైవ శక్తికి తాను నిలయుడనని మానవుడెప్పుడు, ప్రతి వస్తువును, ప్రతివ్యక్తిని బ్రహ్మముగానే పరిగణిస్తాడు. గీతలోని రెండు ప్రఖ్యాత శ్లోకములలో భగవంతుడు ఏమని ప్రకటించాడంటే "ఎవ్వాని అంతర్గతం యోగమునకనుగుణ్యం కాబడినదో, అందరిలోను వాడు తననూ, తనలో అందరినీ చూచును. ఎల్ల ఎడల ఆతనికి ఒకేరీతిగ గోచరించును. ఎవరికైతే నేను ఎల్లెడల గోచరిస్తానో, నాలో ఎల్లరు గోచరిస్తారో ఆట్టివారికి నేను దూరమగుట కాని ఆట్టివారు నాకు దూరమగుట కానీ జరుగదు (VI 29/30)

అందువలన అది మిక్కిలి దగ్గరిదానికన్న చేరువ. దానిని ఎవరి మనస్సు, ద్వారా వారే సమీపించవలసి ఉండును. పరాశ్రయ "ప్రపంచం మూసివేయబడినప్పుడు. మనస్సు ప్రశాంతమై ఆ ప్రశాంతిలో పరమాత్మ సాక్షాత్కరించును." (వివేక చూడామణి) ఇది అందుకోవలసిన ఆధ్యాత్మిక క్రమశిక్షణను నిర్లక్ష్యము చేయుటకాదు. అయితే లక్ష్యం సుస్పష్టంగా, మార్గాన్ని నిర్ణయించుకోవాలి. ప్రయాణానికి కావలసిన పరికరాలన్ని మానవుని వద్దనే ఉన్నవి. బహు దూరమైనా కడుచేరువ అని పవిత్ర గ్రంథాలలో పేర్కొనబడిన వాక్యంలో ఇప్పుడు ఎటువంటి పరస్పర వైరుధ్యము ఉండదు.

ఆత్మసాధనకు మునులు, ఋషులు పేర్కొన్న మార్గాలను గూర్చికాని, వాటి యోగ్యతవలో తరతమ భేదాలను గూర్చికాని మనమిచ్చట చర్చించబోవటం లేదు. ప్రతివారికి, అన్నిస్థాయిలవారికి, ఆధ్యా పరిణామములో వివిధదశలలో ఉన్న వారికీ ఒక్కొక్క సాధన ఉంది. నిర్మలమైన జ్ఞానంద్వారా పరమాత్మను నేరుగా అవగాహన చేసుకొనుట నుండి యోచనా పరులు సిద్ధిని పొందుదురు, అందులకు ఉద్రేక పూరిత మార్గము, భక్తి ప్రేమలతో కూడినది. ప్రపంచములోనిత్యం సాంసారిక బరువు బాధ్యతలలో సతమతమయ్యే సామాన్య మానవుడు తాను చేయు ప్రతి పనిని భగవదర్పితము చేయుటవలన తన లక్ష్యాన్ని చేరుకొనగలడు. చివరకు జ్ఞానము, ప్రేమ భక్తి శ్రద్ధలతో కూడిన కార్యాచరణ సమైక్యమవుతుంది. నవీన ప్రపంచానికి ఆధ్యాత్మిక మార్గదర్శక గ్రంథంగా గుర్తింపబడిన గీత భక్తిశ్రద్ధలతో కూడిన కార్యాచరణను (కర్మయోగం) మిక్కిలి ఆచరణయోగ్యమైనదిగ గుర్తించింది. కాబట్టి అనాసక్తుడవై చెయ్యవలసిన కర్తవ్యములను చెయ్యి, ఎందువల్లనంటే మానవుడు అనాసక్తుడై కర్మలు చేయుటవలన అత్యున్నత స్థాయిని పొందుతాడు" అని భగవానుడు పేర్కొని భక్తిశ్రద్ధలతో కూడిన కార్యాచరణ వలన పరిపూర్ణతను పొందిన జనక రాజు మొదలగువారి ఉదాహరణలను పేర్కొంటాడు.

భగవంతుడు మన వాడు, మనం భగవంతునికి చెందినవారము. ఆయన నిత్యసాక్షి. మనకు తెలివి తేటలూ ఆత్మజ్ఞానము ఉండే అతడే మనకు ఎన్నడూ వీడని స్నేహితుడు. అర్జునుని వలె శరణు జొచ్చిన వారికి జీవితసమరంలో సారథి. ఆయన మనకు మేలుచేయడానికి మనతోనే ఉన్నాడు. "భగవంతు డెక్కడో నీకు దూరంగాలేడు. ఆయన నీ ముందు, నీ వెనక ఉండి పిలుస్తున్నాడు. ఆదేశిస్తున్నాడు. రక్షిస్తున్నాడు. సూచనలు చేస్తున్నాడు. అంతర్వాణితో ఎల్లప్పుడు మాట్లాడుతూనే ఉంది. ఆయన కొరకు వెదకనవసరంలేదు; అతడు ఎల్లప్పుడూ నీ ప్రక్కనే సిద్ధంగా ఉన్నాడు." అని భగవాన్ సుస్పష్టంగా తెలిపారు. ఈ భావాలు మన సాధనకు పరిపుష్టిని కలిగించాలి. దయామయుడైన భగవాన్ ఆ దివ్య వైభవాన్ని గుర్తించే దృష్టిని మనకు ప్రసాదించుగాక !

సి.పి.కె. నాయర్

# ఆచరణ ప్రచారమున కాధారము

నతపాంసే నతేర్థ్యానాం
నశాస్త్రాణి న జపానహి
సంసార సాగరోత్తారే
సజ్జనంసేవనం వినా

పవిత్రాత్మ స్వరూపులారా ! సేవా కార్యకర్తలారా !

మనము ఈ అయిదు దినములనుండి అన్ని రాష్ట్రములనుండి గుమికూడినటువంటి సేవాదళ కార్యకర్తలతో కార్యమును ఆనందముగా నడుపుకునే నిమిత్తమై గుమికూడి నామనే సత్యాన్ని గుర్తించాలి. కేవలం వివిధ రాష్ట్రాలనుండి ఏతెంచినటువంటి సేవాదళ కార్యకర్తలను స్నేహం చేసుకునే నిమిత్తమై, లోక సంబంధమైన విషయములను చర్చించుకునే నిమిత్తమై ఒకరికొకరు కొంతకాలమును వ్యర్థపరచుకునే నిమిత్తమై మనము ఈ కార్యములో చేరలేదు అనే సత్యాన్ని మనం జ్ఞప్తియందుంచుకోవాలి. కాని మనకు తెలియని విషయాలను, ఆదర్శవంతమైన సేవలను అనుష్ఠించవలసిన పవిత్రకార్యములను మనం కొంత వరకు గుర్తించి ఆచరణలో పెట్టే ఆశయము నిమిత్తమై మనమీ సమావేశంలో చేరినామనే సత్యాన్ని జ్ఞప్తియందుంచుకోవాలి. ఈనాడు సేవాదళ సభ్యులందరూ అనుష్ఠాన ప్రియులు కావాలి. ఆచరణ కుశలురు కావాలి. అన్ని రంగములలో సత్యసాయి సంస్థల అనేక భాగములందును సేవాదళము వారు Common గా ఒక అధికారాన్ని తీసుకొనేటటువంటి కార్యవర్గము. ఒక సత్యసాయి సమితికి భజన మండలికి బాలవికాస్‌కు కొన్ని రకములైన బాధ్యతలు ఉంటాయి కాని సేవాదళం వారికి అన్నిరకముల యందుపాల్గొనే బాధ్యత సమానంగా ఉంటుంది. ఒక భజన జరుగు తున్నదంటే ఆభజన నిర్వహణలో ఎట్టి ఆటంకము జరుగకుండ సేవాదళం అక్కడకూడా ఉంటుంది. అట్లే మహిళావిభాగం ఎక్కడైనా కార్యక్రమమును పూను కున్నప్పుడు ఆ కార్యక్రమమును తగిన విధంగా

నిర్వర్తింపజేయటానికి ఈ సేవాదళం అక్కడ కూడను పాల్గొనవలసి వస్తుంది. కనుక ఏ ఒక్క రంగమునందయినను పాల్గొను అధికారము కలిగి ఉండటంచేత మనము ప్రత్యేకమయిన విశిష్టతను, ప్రత్యేకించిన తర్ఫీదును అందుకొనవలసివస్తుంది. అయితే మనము ఈ సమావేశములో అనేకమయిన నూతన విషయాలను నిర్ణయించుకుంటూ వచ్చాం. ముమ్ముందు చేపట్టవలసిన విషయాలను కూడా నిర్ణయించుకున్నాము. అన్ని నిర్ణయించుకొనుటతో సరిపోతున్నవేగాని. ఆచరణలో ఎంతవరకు ప్రవేశపెడుతున్నామనేది, ఎవరికి వారు ఆత్మ పరిశీలన చేసుకోవాలి. చెప్పవచ్చు కోటి-చేయరు ఒక్కటి. అని నేను అనేక పర్యాయములు చెప్తుంటాను. మనము అన్ని నిర్ణయాలు చాల ఆనందంగా తలలూపుతూ ఈ విధంగా చేయాలి. అని నిర్ణయాలు చేస్తున్నాంగాని, దీనిని అనుష్ఠానం చేస్తున్నామా ? అందిస్తున్నామా ? దీనికి ఎవరికివారే సాక్షి. All INDIA Conference లో కూడను మనము అనేకవిధములయిన నిర్ణయాలు తీసుకున్నాము. గడచిన సంవత్సరము All India Savadal Conference లో కూడను అనేక విధములయిన నిర్ణయాలు తీసుకున్నాము. కాని అనేకమంది కార్యకర్తలయినవారు ఈ సమావేశంలో పాల్గొంటున్నారు కనుక, ఆ నిర్ణయాలను ఎంతవరకు ఆచరించాము, అనేది మీలో ఎవరైనా ధైర్యసాహసాలతో చెప్పటానికి అవకాశము లేదు. కనుక మనం పవిత్రమైన కాలమును, ఎంతో దూర ప్రదేశముల నుండి ప్రయాణం చేసివచ్చి ఈ అయిదు, ఆరు దినములంతా పవిత్ర సన్నిధిని పెన్నిధిగా భావించుకొని ఎంతో సుఖశాంతులతో ఇందులో పాల్గొన్నందుకు ఏకీంచిత్తయిననూ మనము ఆచరణలో పెట్టటానికి ప్రయత్నించకుండిన ఈ సమావేశమెందుకు ? ఈ కాలం వ్యర్థం చేయట మెందుకు ? ఈ పవిత్రసన్నిధిలో కాలమును అపవిత్రము చేయుట దుర్మార్గమని కూడ చెప్పుటకు ఎట్టి సందేహము ఉండదు. **Waste of money, waste of time, Time waste is life waste, waste of money is evil** అన్నారు. కనుక మనము నేటికైనా కొంత సత్యాన్ని గుర్తించి మనం తీసుకున్న నిర్ణయాలను కార్య రూపంలో నిరూపించే వ్యక్తిత్వాన్ని నిరూపించాలి. అనేకమంది కార్యకర్తలు ఇట్టి సమావేశములలో పాల్గొని తిరిగి వెళ్ళిన తర్వాత సేవాదళ సభ్యులకు కూడను ఈ కార్యక్రమము లోపల ఏ యే నిర్ణయాలు తీసుకున్నారు, ఏ విధమైన మార్గాన్ని అనుసరించడానికి ప్రయత్నిస్తారు, అనే విషయాన్ని కూడా సరిగ్గా అర్థం చెప్పలేకపోతున్నారు. అలాంటి కార్యకర్తలవల్ల మన కర్తవ్య కర్మలకు కొంతవరకు అపజయం కలగటానికి అవకాశము ఉన్నది. కారణం ఏమిటి ? ఇక్కడ కార్యకర్తలు మాత్రమే ప్రవేశించారు తప్ప మిగిలిన సేవకులు ఇందులో పాల్గొనలేదు. కనుక ఈ District సేవాదళ కన్వీనర్లు ఇక్కడ నుండి వెళ్ళిన తక్షణమే మొట్టమొదట, సేవాదళ్ Meeting పెట్టుకొని ఆయా జిల్లాలవారీగ, వారితో ఈ సమావేశంలో నిర్ణయించిన నిర్ణయాలను మనము ముందు జరుపవలసిన కార్యాలను వారికి సుస్పష్టంగా విడివిడిగా వివరించి చెప్పి, ఆకార్యాన్ని చేపట్టటానికి కృషిసలపాలి. ఈ నాటినుండయినా మన కార్యంలో గట్టి పట్టుదల పట్టి తర్వాత కార్యాచరణకు కంకణం కట్టుకునే ప్రోత్సాహ ఉత్సాహాలను కలిగించాలి. అట్టి ఉత్సాహ ప్రోత్సాహములతో పాల్గొనని వ్యక్తులను తక్షణమే తీసివేయుటకు ప్రయత్నించాలి. ఈనాడు అట్టివారిని తీసివేయలేని దురవస్థలో మనం ఉంటున్నామంటే మనము సరిఅయిన పద్ధతులలో, ఆదర్శవంతమయిన రీతిలో Leadership ఉండటంలేదు. కనుకనే అట్టి వారిని తీసివేయుటకు అధైర్యం వెంటాడుతున్నది. మనం అందరికి సేవాతత్వాన్ని ఈ విధంగా చేయాలి, ఆవిధం ఉండాలి అని ఆశిస్తున్నామే తప్ప, ఆ అదే

శానుసారంగా ఆచరిస్తున్నామా అని మన హృదయ పరిశీలన చేసుకోవాలి. అధికారి అయిన వ్యక్తి ఆదర్శ వంతమయిన కర్మలను ఆచరిస్తు, వినయ విధేయత లతో ప్రవర్తించాలి. అధికారికి వినయమే సింహాసనము. కాని కేవలము సోమరిపోతుకి అహంకారమే సింహాసనము. కనుక మనము ఆదర్శవంతమయిన జీవులుగా సేవాభావాన్ని గుర్తించిన వ్యక్తులుగా నిర్వర్తించాలంటే వినయ విధేయతలతో కార్యాచరణకు పూనుకోవాలి. మంచి మాటలనే ప్రవేశ పెట్టాలి. ఈ నాటి విద్యార్థులను గాని, యువకులను గాని, మన సేవాదళంలో చేర్చుకోటానికి వారిని ప్రేమతో, వినయంతో, ఆప్యాయంతో, ఆనందంతో అందులో చేర్చుకోవటానికి ప్రయత్నించాలి. అప్పుడే యువకులు సేవాదళంలో చేరటానికి ఉత్సాహం చూపిస్తారు. మన ప్రవర్తన, మన మాటలు సేవాదళం వారికి ప్రధాన ప్రమాణములు.

మన సేవాదళం సభ్యులుగాని, కార్యకర్తలుకాని, భజనమండలి వారు కాని, సేవా organisations నందున్న అన్ని రంగములందున్న వారు కూడ దీనిని గుర్తించాలి. ఎందుకనగా ఆధ్యాత్మికమునకు ఒక్క గమ్యమే, ఒక్క మార్గమే అత్యవసరము. అనేకత్వాన్ని ఏకత్వంగా రూపొందించుచే ఆధ్యాత్మికము యొక్క ఏకైక లక్ష్యము. కాని ఏకత్వం అనేకత్వంగా భావించుట అజ్ఞానం. దీనినే నేను అనేక పర్యాయములు చెప్పాను. "ఏకం సత్ విప్రాః బహుధా వదంతి"– ఉన్నది ఒక్కటే. అనేకమంది అనేక విధములుగా భావించుటచేత భారతదేశం ఈ విధముగా ఆధ్యాత్మికమున కొంతవరకు కుంటు పడినది. ఈ విషయములలో సత్యసాయి సేవాదళం వారు, అనేక విధములయినటువంటి ప్రబోధలు ప్రచారం చేయుటలో తప్పుండదు. అనగా మొట్టమొదట మనం ఆచరించి తదుపరి ప్రచారం చేయుటలో ఆదర్శం ఉంటుంది. సేవాదళం వారుగాని, సమితి సభ్యులు కాని, సత్యసాయి అనే విశ్వాసం చేత ఒక విధమయిన ఆదర్శంచేత, ఒక విధమయిన ప్రేమచేత దీనిని మనం అనుసరిస్తున్నాము. పోతే కొంతమంది, వేరే వేరే వ్యక్తులు, మహనీయులు వచ్చినప్పుడు దీని విషయంలో ఇంతవరకు అశ్రద్ధ చూపుతూ మరొక మార్గంలో ప్రవేశిస్తూ మరొక మార్గాన్ని ప్రదర్శిస్తూ ఈ విధమయిన bumps, jumps చేస్తూ సత్యసాయి సంస్థలలో ఒక విధమయిన బలహీనత ప్రవేశిస్తున్నది. దీనికి రామకృష్ణపరమహంస చక్కనికథను చెప్పాడు. ఒక రైతు తన పొలంలో నీటి నిమిత్తమై బావిని త్రవ్వటానికి ప్రయత్నించాడు. ఒక ప్రదేశంలో 10 గజములు త్రవ్విన తక్షణమే ఒక పెద్దరాయి వచ్చింది. ఇక్కడ రాయి వచ్చింది కదా అని, అక్కడ మానివేసి మరొక ప్రదేశంలో త్రవ్వటానికి ప్రయత్నించాడు. అక్కడ అయిదుగజములు త్రవ్వేటప్పటికి పెద్దరాయి వచ్చింది. ఇంకో ప్రదేశంలో మూడు గజములు త్రవ్వాడు. అక్కడ మరొకటేదో అడ్డం వచ్చింది. మరొక ప్రదేశమున రెండు గజములు త్రవ్వాడు. అక్కడ సమృద్ధిగా నీరు వచ్చింది. అతను ఆనందిస్తున్నాడు. రెండు గజముల లోతు లోపల నీరు సమృద్ధిగా లభించినదని. కాని రెండు గజములలో నీరు చిక్కిందనే ఆనందం అతనికి ఉత్సాహాన్ని కలిగించినదిగాని ఈ భూమి ఇన్ని చోట్ల గుంటలుగా చేయాల్సివచ్చిన నష్టాన్ని అతను గుర్తించలేదు. ఇక్కడ పది, అక్కడ అయిదు, అక్కడ మూడు, ఇక్కడ రెండు, ఇరవై గజాలు ఒకే దగ్గర త్రవ్వితే ఎందుకు నీరు వచ్చి ఉండదు? అదే విధముగా కొన్ని దినములు సాయిబాబా, మరి కొన్ని దినములు ఇంకొక బాబా, ఇంక కొన్ని దినములు ఇంకొక బాబా, ఈ విధముగా ఒకరి తరువాత ఒకరు jumps, bumps వేసుకొంటూ పోతుంటే మనజీవితము మన హృదయమనే క్షేత్రం లోపల ఎంత నిరాశకు గురి అవుతున్నామో, ఎన్ని గాయాలకు లోనవుతున్నామో, ఎంత

కాలమును వ్యర్థం చేసుకొంటున్నామో మీరు తెలుసుకొనటం లేదు. కనుకనే అనేక మంది, సేవాదళం సభ్యులుకూడను స్వామి ఆజ్ఞచేతనే నేను జరుపుతున్నాని, స్వామి నాకు అనుజ్ఞ ఇచ్చారని, కొన్ని, కొన్ని రకములయిన విచిత్రములు జేసేటప్పటికి, మన సేవాదళం సభ్యులే వారిని ప్రోత్సాహ పరుస్తూ, ఆవిధంగా, ఆ మార్గంలో ప్రచారం చేస్తున్నారు. నిజముగా ప్రత్యక్షమైన స్వామి నీకు ఉంటుండగా ఈ duplicate స్వాములను చూచి పరుగెడుతున్నారు. కనుకనే ఈ విధమయిన పరిస్థితులలో సంస్థలవారు ఒక విధమైన ఆయోమయంలో అవస్థల పాలవుతున్నారు. దీనికే గోపికలు కూడను ఉద్ధవుని ఒక సమయమునందు ప్రశ్నిస్తూవచ్చారు. ఉద్ధవుడు వెళ్ళి గోపికలారా : మీకు యోగ సంబంధమైన మార్గాన్ని సాకల్యంగా బోధిస్తాను : అన్నాడు. గోపికలు కేవలం అక్షర శూన్యులుగా ఉంటున్నారు. ఏ వేదము, ఏ ఉపనిషత్తు, ఏ పురాణము తెలియని అమాయకులుగా ఉన్నారు. కనుక యోగశాస్త్రాన్ని ఉపదేశిస్తాను. ఆ యోగ శక్తిచేత సాక్షాత్ శ్రీకృష్ణుడే సర్వాంతర్యామి అనేటటువంటిది తెలుసుకొని, మీరు సర్వత్ర దర్శించవచ్చును. మీ చింతలను నిర్మూలనము చేసుకొనవచ్చునని, అనేక విధముల బోధించాడు. అప్పుడు గోపికలు చెప్తున్నారు. "ఉద్ధవా ! మాకు ఉన్నది ఒక్కమనస్సు. నీవు చెప్పినట్లు యోగాభ్యాసము నేర్చుకొనుటకు మాకు రెండవ మనస్సులేదు. ఇంకే విధమయిన యోగశక్తులు సాధించుటకు మూడవ మనస్సులేదు. మరి నాల్గవ మనస్సు ఏమయినా ఉంటుంటే మేము సంసారముచేసి, భర్తలను, అత్తలను, సంతోష పెట్టటానికే పూనుకొనే వారము. మాకు నాల్గవ మనస్సు కూడలేదు. కనుక మాకు అనేకమనస్సులే ఉంటుంటే; ఒక మనస్సు యోగాభ్యాసానికి ఒక మనస్సు సంసారానికి, ఇంకో మనస్సు వ్యవహారాలకూ, ఇంకో మనస్సు ప్రాపంచిక విషయాలకు ఈ విధంగా ప్రవేశపెట్టి ఏదో ఒక మనస్సుతో కృష్ణునిని ప్రార్థించేవారము. మాకున్నది ఒకేమనస్సు. ఆ మనస్సును కృష్ణునికి అంకితము గావించుకున్నాము. కనుక ఈ యోగాభ్యాసం చేయటానికి రెండవమనస్సు లేదు. వచ్చిన దారిని వెళ్ళు" అన్నారు. కనుక ఆ మార్గము చక్కని మార్గము. మనము ఒక్క మనసుతోనే ఉండాలి. రెండు మూడు మనస్సులు పెట్టుకోకూడదు. ఒక్కమనస్సుతోనే మనము ఇన్ని ఇక్కట్లకు గురి అవుతున్నాము. ఇంక అనేక మనస్సులు మనం అభివృద్ధి పరచుకుంటే. ఇక ఎన్ని అవస్థలకు గురి అవుతామో చెప్పుటకు వీలుకాదు

ఒకనాడు అనంతపురంలో వేరే College లోపల Sports day అని పెట్టి దానికి స్వామిని బహుమతులు అందించమని చెప్పారు. అప్పుడు నేను చెప్పాను. "అయ్యా! ఉన్న ఒక్కమతి తోనే అవస్థ పడుతున్నారు. ఇక బహుమతులు నేను ప్రసాదించటమేమిటి ? నేను దీనిలో పాల్గొనను అని చెప్పాను. కనుక మనము ఏకమనస్కులమై, ఏకారాధన చేసి, ఏకాత్మస్వరూపుడయిన, దైవత్వాన్ని చేరటానికి ప్రయత్నంచెయ్యాలి. కాని అనేక మనస్సులు మార్చుకోవటానికి ఏ మాత్రం పూనుకొనకూడదు. ఏదో పిచ్చి గడ్డి పండించాలంటే భూమిని దున్ననక్కర లేదు. దుక్కి చేయనక్కర లేదు. నీరు పెట్టనక్కర లేదు. మంచి పంట పండించటానికి, అనేక విధములుగా దున్ని, దుక్కిచేసి, కలుపులు తీసి సకాలములో నీరు, ఎఱువులు వేసి, దానికి చేయవలసిన పోషణ చేయాలి. కనుక అనేకత్వాన్ని మనం ప్రయత్నం చేయటానికి ఎట్టి సాధన అక్కరలేదు. ఏకత్వాన్ని అభివృద్ధి పరచుకోవటానికి అనేక ప్రయత్నాలు చేయాలి. దీనినే సాధన అని, దీనినే ప్రపత్తి అని, అనేక విధాలుగా చెప్తారు. ఈ విధమయిన ఏకత్వానికి చేరేలోపల సేవ ప్రధానమయినది. కష్టపడే వారికి, దిక్కులేని వారికి, దురవస్థలలో ఉండేవారికి, భగవత్

సేవగా భావించి వారికి సేవ చేయుటానికి పూను కోవాలి. సాధువులు, ఆదర్శవంతమయిన మహనీయులు, ఇట్టి సేవతత్వాన్ని, భగవంతుని అనుగ్రహాన్ని అందించారు. ఏకనాథుని కథ అందరకు తెలిసినదే. ఏకనాథుడు కాశీ వెళ్ళి, విశ్వేశ్వరుని దర్శించి, తీర్థమును ఒక బిందెలో పోసికొని, కావడిలో పెట్టుకొని సంతోషంతో వస్తున్నాడు – కాశీ తీర్థము, రామేశ్వరంలో కలుపుట ప్రాచీన భారతీయ సాంప్రదాయం ఈ రామేశ్వరమునకు తీసుకుని వెళ్ళే నిమిత్తమై, కావడిలో పెట్టుకుని వస్తుండగా మధ్య మార్గంలో తాపమునకు వేడికి తట్టుకొనలేక, ఒక గార్దభము నోరు తెరుచుకొని చాలా దాహముతో ప్రాణం విడిచే స్థితిలో పడిఉంది. ఆ దృశ్యాన్ని ఏకనాథుడు చూశాడు. తక్షణమే భరించలేక కావడిలో ఉన్న బిందెడు నీరు, వాని నోటిలో పోశాడు. ఆ గాడిదకు దాహం తీరి కొంచెం ప్రాణం వచ్చినట్లుగా చాలా ఉల్లాసముతో లేచి నిల్చుకొని ఆనందంగా వెళ్ళింది. ఆ సమయమునందు వెంట ఉన్న శిష్యులందరు కూడను, "స్వామీ పవిత్రమయిన గంగా జలమును, కాశీ నుండి తెచ్చిన గంగా జలమును, రామేశ్వరములో కలుపక, రామేశ్వరునికి, అభిషేకము చేయకుండ ఈ గార్ధభానికి వినియోగించితిరే! అని ప్రశ్నించాడు." శిష్యులారా... ఇది దుర్వినియోగం కాదు, ఇది సద్వినియోగం. మీ దృష్టిలో గార్దభము వలె తోస్తున్నది. ఆ రామేశ్వరుడే నాకు దాహం తీర్చమని, ఈ మధ్య మార్గములో ఈ గార్దభ రూపంలో నన్ననుసరిస్తూ వచ్చాడు. అవసరమయిన సమయంలో దీనిని, వినియోగించక అనవసరముగా వినియోగించుట దుర్వినియోగం. భగవంతునకు కాశీ జలమేమిటి ? ప్రయాగ జలమేమిటి ? రామేశ్వర జలం ఏమిటి ? సర్వం ఏక స్వరూపమే అయితే; ఈ విధమయిన సేవాతత్వం లోపల సర్వజీవులకు, సర్వప్రాణులకు సహాయం చేయుట, ఈశ్వర సేవగా

నిపుణత ఏకనాథుడు ఈ విధమయిన కథను కల్పించి, లోకానికి అందించాడు. మనం 'ఈశావాస్య మిదం సర్వం' అని చెప్పుతాము. అన్ని జీవులందు ఈశ్వరుడు ఉన్నాడని చెప్పుటం మాత్రం చెప్పుతున్నాము, చేసేటప్పుడు మాత్రం ఇది గార్దభం, ఇది లింగం, ఇది మనిషి అని పెక్కు విధములయిన తారతమ్యాలు కల్పిస్తున్నాం. త్యాగరాజు కూడ చెప్పాడు" చీమ మొదలు బ్రహ్మలో, శివకేశవాదులలో ప్రేమ మీర మెలగుచుండె రాముడన్న తోవగా" అన్నాడు, చెప్తున్నాం. కాని చతుర్ముఖునితో బ్రహ్మ వచ్చి నిలిచి నప్పుడు "అహా! నా అదృష్ట మని" నమస్కారం చేస్తూ, తన్మయమునయిపోయి, తనను తాను మరచి పోతున్నాడు. కాని అదే సమయమున ఒక చిన్న చీమ పీపుపయిన ఉండిన దానిని తక్షణమే దానిని కొట్టి దానిని నలిపి వేస్తున్నాము. ఈ యొక్క మాటకు, ఈ క్రియకు, ఎంత భేద మున్నదో గమనించండి. ఆ విశ్వాసముండిన సమయములో నిన్ను బాధిస్తున్నదని వానిని ప్రక్కకు నెట్టవచ్చునో గాని, దానిని నలిపి వేయటానికి ప్రయత్నం చేస్తున్నాము. అదేవిధంగా క్రమక్రమంగా మన సాధనను, అభివృద్ధి పరచుకోవటానికి ఇట్టి పద్ధతులు అవలంభించాలి. పూర్వీకులు ఈ విధమయిన సేవనిమిత్తమై అనేక విధములయిన మార్గములను నిరూపిస్తూ వచ్చారు,

ఒక చిన్న ఉదాహరణ : పూర్వకాలమందు స్త్రీలు వెలుపలకు వచ్చువారు కాదు. వీరు ఈ విధమయిన సమాజసేవ చేయుటకు అవకాశము ఉండేది కాదు. కనుక, ఏదో ఒక విధముగా భూతప్రేతి, భూతసేవ ఆచరించాలనే సంకల్పం దృఢంగా ఉండేది. అప్పుడు వారు చక్కని ఆదర్శవంతమయిన మార్గాన్ని అవలంభిస్తూ వచ్చారు. బియ్యమును పిండిగా చేసి వానిని ఇంటిముందు అందముగను ఆదర్శముగను ఉండే సేవ నిమిత్తమై ముగ్గులు వేసేవారు : ఒక వైపు

ఇంటికి శుభసూచకం మరోవైపు చీమలు, ఆ బియ్యపు పిండిని తిని ఆ జీవులు తృప్తి పొందుట వలన మనకు తృప్తి. ఇది చీమలు మాత్రమే కాక కొన్ని పక్షులు కూడను ఆరగించి సంతృప్తి పడేవి. ఉత్తరాయణం సంక్రాంతి వచ్చుటప్పటికి, బజారంతా ముగ్గులు పెట్టే టటువంటి వారు ఈ స్త్రీలు. ఉత్తరాయణం అనగ మోక్షమునకు అతి సమీపమయిన కాలమును ప్రవేశించి నటు భావించేవారు. ఆనెల అంతయూ కాకులు, పక్షులు, పావురాళ్లు, భుజించి ఆనందించేవి. ఇది ఈ ముగ్గులలోని అంతరార్థం, ఈనాడు ఆధునిక స్త్రీలు కూడ ముగ్గులు వేస్తున్నారు. కాని ఈ ముగ్గులు సున్నంతో వేస్తున్నారు. ఏ పక్షి కూడ దగ్గరకు రాదు. కేవలం అలంకారం మాత్రమే కనిపిస్తుంది కాని, దీని వలన సేవభావం, త్యాగం, కనిపించదు. కనుక ప్రాచీన కాలం నుండి మన భారత దేశం త్యాగ భావము చేత, సేవభావము చేత, ఆదర్శమును అన్ని దేశములకు అందించినది.

దీనినే వేదమునందు కూడ "నకర్మణా నప్రజ యాధనేన, త్యాగేనైకే అమృతత్వమనసుః" మన త్యాగమే, మనసేవయే, అమృతత్వమయిన ఆనందా ఆనందాన్ని అందిస్తుందని బోధిస్తూ వచ్చింది. మొట్టమొదట మనం జపధ్యానములు చేయుటకు, అవకాశము చిక్కిన, వానిని చేయుటకు తప్పులేదు. కాని అట్టి అవకాశము లేక పోయినా, సేవ చేస్తూ ఇదే జపం ఇదే ధ్యానం మనం కాలమును సార్థకము కావించుకోవాలి. మీరు వేరుగా భావించకూడదు. రెండు వందల మంది సేవా కార్యకర్తలు ఈ సమా వేశంలో పాల్గొన్నారు. ప్రతి దినం జపధ్యానములు చేసేవారు ఎందరున్నరో చెప్పండి. నాలుగో వంత యినా లేరు. ఏ ఒక్క Dt. President అయినా, ఏ State President అయినా, ఏ Convener అయినా చేస్తున్నారో లేచి చెప్పండి. ఇలాంటి సమ యములో సేవాదళ సభ్యులకు చెప్పే అధికారం మనకు ఎట్లా ఉంటుంది? కేవలం మనకు ఏదో ఒక Subject అందించినారు కదా అని, ఏదో ఒక నూతన మయిన దాన్ని చెప్పాలన్న ఉద్రూతతో చెప్తున్నామో గాని, హృదయపూర్వకంగా చెప్పు తున్నామా అనేదానిని, నీకు నీవే సాక్షిగా ఉన్నావు. కాని ఒకరు చెప్పినా, చెప్పకపోయినా మన సేవా దళం నందు సేవతో పాటు సాధన కూడ అత్యవ సరం. ఎందుకంటే వ్యక్తిగతమయిన సాధన negative వంటిది. ఈ సమిష్టి స్వరూపమయినటు వంటి సేవ positive. ఈ negative, positive తో కలసి నప్పుడు కొంతవరకు లోక సంబంధ మయిన విజయాన్ని సాధించగలము. అక్కడ నుంచి ఈ plastic wire వచ్చి ఉంది. కాని అక్కడ, ఎక్కడో చూస్తే అక్కడ current వెలుగడం లేదు. కాని అక్కడ కూడ current ఉన్నది. కాని అక్కడ మనం bulb పెట్టామో అక్కడ మాత్రమే స్వస్వ రూపంతో కనిపిస్తుంది. అయితే మనము మన mind అనే negative ను ఒక powerfull bulb గా అభివృద్ధి చేసుకోవాలి.

ఇక్కడ ఆ wire ఉంది, ఆ wire లోపలపైన ప్లాస్టిక్ wire, లోపల copper wire ఉంది. కాని plastic wire, plastic wire కలిస్తే ఏ మాత్రం current ప్రసరించటం లేదు. కాని ఆ plastic wire లో ఉన్నటువంటి యొక్క copper wire ను కట్ చేసి కలిపితే, cerrent ఫ్లో అవుతుంది. కనుక దివ్యత్వ మనేటు వంటి cerrent ప్రతి వ్యక్తిలోనూ ఉన్నది. మన దేహం ఒక ప్లాస్టిక్ వైరు. ప్లాస్టిక్ వైరు ప్లాస్టిక్ వైరుని కలిపితే వచ్చేదేమిలేదు. కాని, ప్లాస్టిక్ వైరు లోపల ఉండేటటు వంటి కాపరు వైరు అనేటు వంటి మైండుకి మైండ్ కలిపితే ఈ దివ్యత్వం ప్రసరిస్తుంది. కనుక మనం ఈ నాడు ఇతరులతో ఏ విధంగా కల పాలంటే మొట్టమొదట ఈ కాపర్ వైరుతో పాటు ఈ ప్లాస్టిక్ వైరును కూడ చేర్చాలి. కనుక ఈ ప్లాస్టిక్

వైరు పైకి కనబడుతుంది. కరంటుని ప్రసరింప జేసే శక్తి మనస్సు. అదే కాపరు వైరు. దేహంతో మనం సేవ చేస్తూ, ఈ మానసిక సంబంధమైన ప్రేమతో వారిని చేరటానికి ప్రయత్నించాలి. కనుక ఈ నాడు మనం ఈ ప్లాస్టిక్ వైరు అనే దేహంతో మన ధ్యానంలో కూర్చుంటున్నాము. కాని, ఒట్టి దేహం మాత్రం కూర్చున్నంత మాత్రాన ప్రయోజనం లేదు. దానికి మనస్సును connect చేయాలి. ఈ మనస్సునకు కొన్ని విధములయిన తర్ఫీదును మనం చేస్తూరావాలి. దీనికొక చిన్నకథ చెప్తున్నాను.

ఒక శ్రీమంతుడయిన గృహస్థుడు జీవించేవాడు. అతనికి ఒక విధమయిన దయ, ప్రేమ కలవు. ఒక నాడు, తాను భుజించే సమయం లోపల ఒక కుక్క ఆ ఇంటికి వచ్చింది. ఆకలితో బాధపడేటు వంటి శునకమును చూచి, లోపలకు వెళ్ళి కొంత అన్నం తెచ్చి వేశాడు. ఆనాడు గడచింది. రెండవ రోజు కూడ ఆ కుక్క ఆ సమయానికి వచ్చింది. ఈ విధంగా కుక్కలూ రావడం యజమాని అన్నం పెట్టటం ఇట్లు, ఒక సంవత్సరం గడచింది. ఈ విధంగా జరగడం చేత ఆ యజమానికి చాలా విసుగు పుట్టింది. దీనిని ఏ విధంగా తరిమి కొట్టాలి? ఇది ఎంత కొట్టినా, ఎంత హింసించినా పోవడం లేదు. ఆది వెనుకకు పోవాలంటే ఏంచేయాలి? ఆది మన ఇంటికి రావటానికి ఏ అలవాటును practice చేశామో ఆ practice ద్వారానే, కొంత మార్పు చేస్తే మన ఇంటికి రావడం మాన వచ్చు. నేను కొన్ని సంవత్సరములు అన్నం పెట్టుట వలన ఆ కుక్క నా ఇంటికి వస్తున్నది. నేను కొన్ని దినములు అన్నం పెట్టకుండా ఉంటే ఆ కుక్క వెళ్ళి పోతుంది. అదే విధంగా అనేక జన్మ జన్మల నుండి కూడను మనయొక్క ఆత్మయజమానుని ఇంటికి, ఈ విషయ సంబంధమయిన వ్యామోహ మనేటటువంటి, ఆకలితో ఈ mind అనేటు వంటి dog మన ఇంటిలో ప్రవేశిస్తున్నది. ఆ యొక్క మనస్సనే కుక్కకు మనం, విషయ వాసనలకు అందిస్తూ అందిస్తూ, చక్కగా అలవాటు చేస్తున్నాము. కనుక అది మనలను వదలి పెట్టలేక పోతున్నది. మీరు సామాన్యంగా బజారులో తిరిగే సమయంలో గాని. వేరే పనులు చేసేటప్పుడు గాని, ఈ మనస్సు కొంతవరకు active గా ఉంటుంది. కాని ధ్యానంలో కూర్చుందాము అనుకునేడప్పటికి లేని పనులన్ని గుర్తువస్తాయి. అనవసరంగా అన్ని వైపులా పరుగెడుతుంది. అలాంటి ధ్యానం కంటే కేవలం సామాన్యమయిన పనులు చేసుకోవడం ఒక పెద్ద ధ్యానంగా ఊహించవచ్చు. కనుక దీనివలన నిరుత్సాహపడనక్కర లేదు. కనుక ఈ విధమయిన విషయవాసనలు అందించి, అందించి ఈ మనస్సు ఇట్టి చాంచల్యానికి పూనుకొనుట చేత కొంత కాలం ఈ విషయవాసనలు అందించ కూండా దీనిని ప్రశాంత మయిన ఆత్మతత్త్వంలో ప్రవేశింప జేయటానికి కొన్ని విరుద్ధమయిన సాధనలు చేయాలి. ఏ విధంగా చేయాలి? అనగా మనస్సునకు తీరికలేని పనిని మనము అందించినపుడు ఈ మనస్సు యొక్క బాధ మనకు ఏమాత్రం ఉండదు. కొంతమంది మీలో చూసి ఉంటారు. కోతులను పట్టేవారు ఎప్పుడును ఎక్కడం దిగడం, ఎక్కడం దిగడం ఈ చంచలత్వం దాని స్వభావం, ఊరికే ఒక చోట కూర్చో పెడితే ఏదో ఒక కోతి చేష్టలంతా చేస్తుంటుంది. అందువలన ఒక్కొక్క ఇంటికి తీసుకుపోయి ఎక్కరా తిమన్న, దిగరా తిమన్న అని, ఒక కర్రతో ఆడించి, బిచ్చ మెత్తుకుంటూ ఉంటారు. అదే విధముగా ఈ mind ఒక పిచ్చికోతి. ఈ కోతికి కొంతవరకు తీవ్రమయిన పనిని కల్పించాలి. మొట్టమొదటననే ధానంలో కూర్చుంటే ఈ కోతి మనకు స్వాధినం కాదు మొట్ట మొదట మనం ఈ monkey mind & watch man పని ఇవ్వాలి. ఎవరు లోపలికి పోతున్నారు.

ఎవరు బైటకు వస్తున్నారు. సో...... అని లోపలకు పోతున్నాడు. హం,...... అని బైటకు వస్తున్నాడు. పోయేటటువంటి వాడు సో, వచ్చేటటువంటి వాడు 'హం' ఈ "సోహం" ను గమనించే watch man పని అప్ప చెప్తే ఆ మనస్సు పోయేవాడు సో... ; వాచ్చేవాడు హం... ; అని watch చేస్తూ ఉండటం చేత మనస్సు ఒక్క అయిదు నిముషము లలో స్వాధీనమునకు వస్తుంది. ఈ విధంగా అయిదు నిముషములు చేసిన తర్వాత, నీకు ప్రీతి అయిన చిత్రాన్ని ముందు పెట్టండి లేదా ఒక జ్యోతిని వెలి గించి పెట్టుకో, ఆ జ్యోతిని నీవు కన్నులు తెరిచి చక్కగా చూడు, ఏ ఒక్క జ్యోతి నీ బహిర్ముఖంగా గోచరిస్తున్నదో, దానినే, ఆ జ్యోతినే కన్నులు మూసుకొని నీలో ప్రవేశించినట్లు భావించు. కేవలం అక్కడ కూడా మనస్సుకు తీవ్రమయిన పనిని పెట్టాలి. "ఓ మనసా! ఆ జ్యోతిని తీసుకొని నా హృదయంలో చేర్చు" అని ఆ మనస్సుతో ఆ జ్యోతిని హృదయంలో చేర్చాలి. హృదయ కమలంలో జ్యోతి వెలుగుతున్నట్లు భావించాలి. అక్కడి నుండి ఆ జ్యోతి ని సర్వాంగములందు ప్రయాణం చేయించాలి. చేతులలో, ఆ జ్యోతి ప్రయాణం చేయాలి. కడుపులో చేయాలి. కళ్ళలో చేయాలి. కన్నులలో, చెవులలో, శరీరంలోని సర్వాంగముల యందు ఈ జ్యోతి ప్రయాణం చేయాలి. ఈ దేహ మంతా సంచారం చేసిన తర్వాత, ఆ దేహము నుండి బయటకు తెప్పించాలి. అక్కడనుండి నీ ప్రక్కఇంటి వారి యందు, బంధుమిత్రులయందు, అందరియందు ఈ జ్యోతి ఉండినట్లు భావించాలి. అంతేకాదు. తదుపరి నీశత్రువులలో కూడను. ఈజ్యోతి ఉండినట్లు భావించాలి. అప్పుడు "ఈశావాస్య మిదం సర్వం" కనుక ఈ యొక్క జ్యోతి ఈ కన్నులలో చేరినది కనుక, bad దృష్టి (చెడుదృష్టి) ఉండరాదు. ఎందుకంటే "తమసోమాజ్యోతిర్గమయ". ఎక్కడ జ్యోతి ఉంటున్నదో అక్కడ చీకటి ఉండదు. కనుక చెడు దృష్టికి అవకాశ మీయకు, నీ చెవులలో జ్యోతి చేరటం చేత చెడు విషయాలు వినుటకు వీలుకాదు. ఆ జ్యోతియే నీ నాలుక పైకి రావటంచేత చెడ్డమాటలు రావటానికి వీలులేదు. నీ పాదములలో ఈ జ్యోతి చేరుటవలన చెడు ప్రదేశములకు నీవు ప్రయాణం చేయుటకు అవ కాశం లేదు. నీ చేతులలో జ్యోతి చేరుటచేత, చెడ్డ పనులు చేయుటకు అవి ముందుకు రావు, కనుక ఈ ఏకజ్యోతిని అనేక విధములుగా ప్రయాణం చేయించి, సర్వత్ర ఉన్న పరమాత్మ జ్యోతి ఒక్కటే అని గుర్తించెందుకు ఈ ధ్యానం చాలా సహాయకారిగా ఉంటుంది. దీపావళి పండుగరోజు మీరు కొంతవరకు గమనించుతుంటారు. చాలా కొవ్వొత్తులను పెట్టి, ఒక క్రొవ్వొత్తి తీసుకొని, ఒక్కొక్క క్రొవ్వొత్తిని వెలిగిస్తాం. ఒక్క జ్యోతినించే అనేక జ్యోతులను వెలిగిస్తున్నాము. వెలిగించిన జ్యోతి పరబ్రహ్మజ్యోతి, అంటింపబడిన జ్యోతులు జీవన జ్యోతులు. చివరకు అంటించిన జ్యోతి, అంటింపబడిన జ్యోతి ఒకటిగానే కనిపిస్తాయి. కనుకనే ఈ పరబ్రహ్మ జ్యోతి, జీవన జ్యోతి ఏకం కావటంచేత, "బ్రహ్మ విద్ బ్రహ్మైవ భవతి" అన్నారు. అది; ఇది; రెండూ ఒకటే, బ్రహ్మతత్వాన్ని తెల్సికున్నవాడు బ్రహ్మగానే రూపొందుతాడు. కనుక జ్యోతిని ఆధారం చేసుకుని ధ్యానం చేయుట చాలా ఉత్తమమయినది, కారణం ఏమిటి ? దేహం క్రమక్రమేణ మార్పు చెందుతూ ఉంటుంది. జ్యోతి మార్పుచెందే వీలులేదు. ఒకచిన్న ఉదాహరణ ఒక చిన్న తొట్టిలో నీరు పోశాము, ఒక్కొక్క కప్పు నీరు, ఆ తొట్టిలో నుండి దీసు కుంటే, ఆ తొట్టె క్షీణం అయిపోతుంది. ఒక ప్రదేశ ములో ఒక లారీ ఇసుకను తెచ్చిపోశాం. ఒక్కొక్కరు ఒక్కొక్క బుట్టలో ఆ ఇసుకను తీసుకొని వెళ్ళితే ఆ ఇసుక కూడా క్షీణం అయిపోతుంది. కాని ఒక్క జ్యోతి నుండి, లక్ష జ్యోతులు వెలిగించినసూ ఆ

్యోతి తగ్గిపోదు. కనుకనే, ఈ జ్యోతికి, "క్షీణే పుణ్యే మర్త్యలోకం విశంతి". అనే తత్త్వం ఉండదు. జ్యోతి అనేది ధ్యానంలో ఉంచుకుని, తదుపరి నీకు ఒక ఆరాధనా రూపం ఇష్టమయితే, ఆ జ్యోతి లోపలనే నీవు ఆ రూపాన్ని, నిలబెట్టుకోవచ్చు. నా ఆరాధ్య దైవం ఈ జ్యోతిలోనే ఉన్నాడు. పరబ్రహ్మ జ్యోతి నుండే అన్ని జ్యోతులు వచ్చినవనే ఏకత్వ భావాన్ని అభివృద్ధి పరచుకొనుట సార్థకమయిన ధ్యానం. కాని ఈనాడు అనేక రకములయిన ధ్యానములు విరివిగా పెరిగినవని, చెప్పుతూ ఉన్నారుగాని, వానిని అనుభవించిన వారు, ఎక్కడా కనిపించటం లేదు. ఇవన్నీ **artificial meditations.** ఒక్కసారి కూర్చున్న తక్షణం సులభంగా శరీరాన్ని మరచిపోతాను, పోతాను అంటారు. ఎక్కడికి పోతున్నాడో, ఏమి చేస్తున్నాడో ఎవ్వరికీ అర్థంకాదు. ఈ విధమయిన సులభమయిన ఈ సాక్షాత్కారం పొందగలిగిన ఆనాటి మహనీయులు, సప్తఋషులు, ఈ సులభ మార్గమును తెలియలేకపోయారా? ఇంత సులభంగా వీరు ఆధ్యాత్మిక మార్గంలో చెందేది ఏమిటి? తన్మయత్వాన్ని చెందుతారు. కొన్ని నిముషముల లోపల దేహము యొక్క ప్రాప్తి ఏమాత్రం ఉండదు. ఇదే ధ్యానం అంటున్నారు. శరీర ప్రజ్ఞ పోయిన మాత్రమున అది ధ్యానం అవుతుందా? బాగా రెండు bottles తాగేసి పడిపోతే అది కూడా ధ్యానమేనా? కానే కాదు. Body consciousness పోవాలి. Super consciousness రావాలి. ఈ Western Country వారు materoalistic life లోపల వారిదంతా hoppi style కావటం చేత, ఈ body consciousnoss పోవటానికి, అనేక విధములుగా ప్రచారం చేసూ వచ్చారు. కాని భారతీయ సంస్కృతి యందు ఇది ధ్యానం అని చెప్పటానికి వీలులేదు.

ధ్యానం అనగా కొంత మంది ఏకాగ్రత (Concenstration) అనుకుంటున్నాము. Concentration అంటే నేను ఇప్పుడు ఒక paper పట్టుకున్నాను. నేను paper లో ఒక విషయం చదువు తున్నాను. Dt. Sevadal Conference అని పెట్టుకున్నాను. ఈ sevadal conference అనేది చదవటానికి నా కన్నులు అక్కడ Concentrate చేయాలి. మనస్సు యోచించాలి. బుద్ధి విచారించాలి. బుద్ధి, మనస్సు, చేయి, కన్నులు ఇవన్నీ concentrate చేసిననే చదవటానికి వీలవుతుంది. అనగా ఈ ఇంద్రియముల సమ్మిళితం చేతనే చదువుట జరుగుతున్నది. కాబట్టి చదవటానికి, వ్రాయటానికి ఒక విధమయిన concentration ఉండాలి. నడవటానికి ఒక concentration ఉండాలి. Plate లో పెట్టిన పదార్థం చపాతీయా? ఇడ్లీయా? అప్పడమా? పూరీనా? అనే concentration లేకపోతే తినటానికి వీలుకాదు. Driving చేయటానికి సరి అయిన concentration ఉండాలి. కనుక concentration నిత్యజీవితంలో routene గా ఉంటున్నది. ఈ concentration ను develop చేసుకోటానికి ధ్యానం ఎందుకు? Concentration మాత్రం ధ్యానం కాదు. Concentration below sense, meditation beyond sense, ఈ beyond sense కు below sense నుండి ప్రయాణం చేయాలి. ఈ below sense start అయి క్రమక్రమంగా ప్రారంభించినపుడు concentration నుండి contemplation ఈ concentration హద్దులు దాటిం తర్వాత meditation వస్తుంది. కనుక concentration, contemplation meditation ఈ మూడు స్థాయిలు ఎట్లున్నాయంటే, concentration-the one you think you are; Conttemplation the one the others think you are; meditation – the one you really are; కనుక you are not one person: ఈ మూడు స్థాయిలలో

మనం ప్రయాణం చేయాలి. దేహంతో ఇంద్రియ నిగ్రహం కావాలి. మనస్సుతో ఆత్మాభివృద్ధిని పొందాలి. ఈ ఆత్మతో ఆత్మానందం అనుభవించాలి. ఈనాడు సేవాదళ్ సభ్యులందరూ work is worship అన్నట్లు మొదట దేహంతో work చేయాలి. మనస్సుతో worship చేయాలి. హృదయంతో విజ్ఞానాన్ని పొందాలి. ఈ విధంగా దేహంతో పని చేస్తూ, మనస్సుతో భగవత్ చింతనచేస్తూ, హృదయంలో ఆనందంలో లీనం కావాలి. Work చేయకుండా worship చేయటానికి వీలుకాదు. work ఒక flower. దీన్ని మనం జాగ్రత్తగా చూసుంటే క్రమక్రమంగా రేకలు రాలిపోయి కాయగా మారుతుంది. ఈ కాయను అభివృద్ధి చేస్తే, ఫలంగామారుతుంది. పూవు, కాయ, ఫలం – ఈ మూడు కూడును, పూవు లేక కాయలేదు, కాయలేకుండ ఫలంకాదు. కనుక work – flower; worship – unripe fruit; wisdom – ripe fruit. ఈ మూడింటిస్థాయియందు మనం మూడుచర్యలుచేయాలి, సమాజసేవ, వ్యక్తిగత సాధన, విశ్వప్రేమ, – ఈ మూడింటి ద్వారా మన సత్య సాయి సంస్థలను పెంచుకొనిపోవాలి. మీరు ఇటువంటి ఆదర్శములను మీ ప్రాంతములకు వెళ్ళి, అందించినట్లయితే సభ్యులు మరింత ఉత్సాహముగా పాల్గొనటానికి అవకాశం ఉంటుంది.. ఈ work worship wisdom ఈ మూడు ఒకే గమ్యానికి చేరుస్తాయి. మనం చాలామంది ప్రయాణమై పోతున్నాం. Train లో ప్రయాణం చేస్తున్నాం. ఈ Train కొంతదూరం వెళ్ళిన తర్వాత అక్కడ ఇంకో train catch చేయవల్సి వస్తుంది అక్కడ ఆ train కొరకు wait చేయాలి. కొంతశ్రమపడవల్సి వస్తుంది ఇట్టి ప్రయాణములు మామూలు trains లో చేయటం చేత, చాలా కాలం వృద్ధా అవుతుంది. శ్రమకుగురి కావలసివస్తుంది. కాని ఈ ordinary train అన్ని stations లో సమానంగా ఆతోతుంది. ఈ ordinary train లోపల throgh carriaces తగిలిస్తారు. ఈ through carriages తగిలించటం వలన train station లో ఆగినప్పటికిని, మనంకూర్చున్న carriage వేరొక train కు attach చేస్తారు. ఇక మూడవది Through train ఉంటుంది. ఈ ordinary train కర్మ మార్గం. Through carriage ఉపాసన. Through train జ్ఞానం, ఈ మూడు trains ఒకే station దాటుతున్నవి. అయితే కర్మమార్గములో అనేకములయిన సుఖ దుఃఖములకు గురికావలసి వస్తుంది. కష్టమయినా పర్వాలేదు. ఎన్ని శ్రమలనయినా ఓర్చుకొనుట చేత మున్ముందు ఫలితం అందిస్తుంది. ఇతరులను ఉద్ధరించాలనుకున్నప్పుడు, ఇతరులకు సహాయం చేయాలనుకున్నప్పుడు, ఇతరుల దుఃఖాన్ని నివారణచేయటానికి, మనం కొంతవరకు కర్మనే ఆధారం చేసుకోవాలి. దుర్మార్గాన్ని ఎదుర్కోవాలన్నా, అన్యాయ అక్రమ, అనాచారములను పట్టి సాధించాలనుకున్నా వారి మార్గంలో మనం కొంత ప్రవేశించవలసి వస్తుంది. ఎట్లనగా రాత్రి మన ఇంటిలో దొంగలు పడ్డారు. మనం కనుకున్నాం. తక్షణమే దొంగలు ముళ్ళదారిలో పరుగెత్తి పోతున్నాడు. అయితే వాడుముళ్ళదారిలో పరుగెత్తున్నాడు కదా అని మనం తారురోడ్డులో, కారు వేసుకొని బయలునేరడానికి సిద్ధమయితే దొంగ చిక్కాడు. ఆ దొంగను పట్టాలంటే ఆ దొంగ వెళ్ళిన దారిలోనే మనం బయలునేరాలి. ఆవిధంగా కష్టజీవులకు మనం సహాయము చేయాలనుకున్నప్పుడు మనం కూడ కష్టంలో దిగాలి. మొట్టమొదట కర్మమార్గంలో ప్రవేశించి పవిత్రతను పొందాలి. లోకంలో దుష్కర్మను దూరంచేయాలనుకుంటే, ఆ కర్మద్వారానే మనం ఆ కర్మను దూరం చేయాలి. కాలిలో విరిగిన ముల్లును. ముల్లుతోనే తీయటానికి ప్రయత్నించాలి. బట్టకంటిన మట్టిని మట్టితోనే శుభ్రంచేయలి. పూర్వ కాలంలో చవుడు అనేవారు. ఈనాడు సోప్ అని సర్ఫ్

అని వచ్చాయి. మట్టితోనే వస్త్రముల మట్టినిపోగొట్టుటకు ప్రయత్నించేవారు. వజ్రాన్ని వజ్రంతోనే కోయాలి. కర్మను కర్మతోనే సాధించాలి. సేవాదళం వారికి కర్మమార్గం ఆదర్శవంతమయిన పవిత్రమయిన మార్గం. ప్రేమస్వరూపులారా... గడచిపోయిన సమావేశములకంటే ఈ సమావేశాన్ని మరింత పవిత్రమయినదిగా, సార్థకమయినదిగా భావించి ఇక్కడ తేసుకున్న నిర్ణయాలను ఆచరణలో పెట్టటం, పెట్టించటం, చేయటం, చేయించటం జరిపించి సంస్థల అభివృద్ధిని విరివిగా పెంచి దేశానికి సరి అయిన నాయకులుగా నిరూపిస్తారని ఆశిస్తూ, ఆశీర్వదిస్తూ, నా ప్రసంగాన్ని విరమిస్తున్నాను.

సేవాదళ్ కన్వీనర్ల ట్రెయినింగ్
కేంప్ సందర్భమున
శ్రీవారి దివ్యసందేశం.



# చాలా దూరం - ఎంతో దగ్గర

( క్రిందటి సంచిక తరువాయి )

పరమేశ్వరుడు సృష్టి అంతటిలోనూ వున్నాడు. కనుక మనకు అత్యంత సన్నిహితుడు. కానీ మనం మాయామోహితులమై-అజ్ఞానం చేత ఆవరింపబడి కేవలం భౌతిక జగత్తులోనే జీవిస్తూ, ఒక విషయానందం నుండి మరొక విషయానందానికి పరుగిడుతూ, మన అస్తిత్వం యొక్క కేంద్రానికి చాలాదూరంగా పోతూ సంసారవలయంలో చిక్కుకుంటున్నాం. దీన్నే వివేకచూడామణిలో ఆచార్యశంకరులు ఇలావర్ణించారు; "జీవుడు దేహభ్రాంతితో ఈదేహాన్ని పోషిస్తూ దానికి స్నానం చేయించుతూ, ఇంద్రియార్థాలతో దాన్ని రక్షిస్తూ వుంటాడు. పట్టు పురుగు తాను సృష్టించిన దారపు కుప్పెలో తనకుతానే బంధించబడినట్లుగా జీవుడుగా దేహంలో బంధింప బడతాడు.

ఇలాటి దేహాత్మ భ్రాంతిని తొలగించుకొని మానవుడు తనకుతానే అద్వితీయబ్రహ్మగా గ్రహించగలగాలి ! మనస్సు తనలోతాను అణిగివుండాలి. ఒక్కసారి మానవుడు తనను తాను దివ్యాత్మస్వరూపుడుగా గుర్తించుకో గలిగితే, అందరిలోనూ, అన్నింటిలోనూ పరబ్రహ్మనే చూస్తాడు. (బ్రహ్మమయం) ప్రసిద్ధములైన ఈ రెండు గీతా శ్లోకముల లోనూ కృష్ణభగవానుడు ఇలా వివరిస్తాడు. "యోగయుక్తాత్ముడు తన ఆత్మయందు సర్వభూతములను, సర్వభూతములయందు తన ఆత్మనూ దర్శిస్తాడు. ఆతడు సమదర్శి. సర్వత్ర నన్ను దర్శించువాడు, నాలో సమస్తమును దర్శించువాడు అగు యోగిని నా దృష్టినుంచి నేను మరల్చను, అతని దృష్టినుండి నేనూ మరలపోనూ. (గీత 6/29,30)

కనుక ఆత్మ మనకు అత్యంత సన్నిహితమైనది. మన వివేకం ద్వారానే మనం దీనిని గ్రహించాలి. "దృశ్యమయ ప్రపంచం మూసుకుపోగానే మనస్సు ప్రశాంతిని పొందుతుంది. ప్రశాంత మనస్సులో పరమాత్మ దర్శనం లభిస్తుంది" అంటుంది వివేక చూడామణి. దానికై నిర్దేశించబడిన ఆధ్యాత్మిక నియమనిష్ఠలను మనం తేలికగా విడిచిపెట్టలేం. ఇప్పుడు మన గమ్యం ఏమిటో, మార్గం ఏలాంటిదో యిందుకు వలసిన సాధన సామాగ్రి ఎట్టిదో విస్పష్టంగా తెలిసింది కనుక శ్రుతి చెప్పినప్రమాణం "అది చాలాదూరమైనది-ఎంతోదగ్గరగా వుంటున్నది" అనటంలో యిప్పుడు మనకు ఎలాంటి గూఢత కనిపించదు.

ఇచట మనం మన మహర్షులు ప్రవచించిన ఆత్మసాక్షాత్కార మార్గాలను గూర్చి, వానిలోగల తరతమ భేదాలను గురించి చర్చించ నవసరంలేదు ప్రతి ఒక్కరికీ, ప్రతీఒక్కరి స్థాయికీ, ఆధ్యాత్మిక

స్థితికీ అనుగుణంగా ఆధ్యాత్మిక సాధన ఏర్పడి వున్నది. విశుద్ధమైన బుద్ధితో, చేతనతో పరతత్త్వమును ప్రత్యక్షముగ తెలుసుకొని, దానిని గూర్చి మనన నిధి ధ్యాసల నొనరించువారికి ఆత్మ సాక్షాత్కారం లభిస్తుంది. ఇదే గమ్యాన్ని ఆరాధన ద్వారా ప్రేమ ద్వారా పొందవచ్చు. ఇది హృదయానుభూతి మార్గం ఇక కర్మానుష్ఠాన పరులైనవారు లౌకిక ధర్మనిర్వ హణ చేస్తున్నవారు తమయొక్క యిచ్ఛను, పర మేశ్వరుని దివ్యసంకల్పమునకు అనుగుణముగా మలచుకొని జీవితగమ్యమును పొందవచ్చును తుట్ట తుదకు జ్ఞానము ప్రేమ దైవాంకితమగు కర్మ ఒకటిగా కలసిపోతాయి ఆధ్యాత్మిక నిఘంటువుగా ఆధునిక యుగంచేత అంగీకరించబడిన భగవద్గీత కర్మ ఫల సమర్పణ రూపంలోని కర్మయోగమే అనుసరణీయమైన ధర్మంగా "నిర్దేశించింది. నిస్సంగు డవై, నీవిధ్యుక్తధర్మాన్ని నీవు నిర్వహించు నిస్సంగ కర్మాచరణచేత మానవుడు పర తత్వాన్నిపొందు తాడు" అంటూ కృష్ణభగవానుడు కర్మద్వారా పరి పూర్ణులైన జనకాది రాజన్యులను ఉదాహరిస్తాడు. (గీత 3-19/20)

భగవంతుడు మనవాడు మనం భగవంతునివాళ్లం భగవంతుడు అనంతసాక్షి మనలో జ్ఞాన దృష్టి, తాత్త్విక దాస్తి వుంటే అతడు మనకు అనవరత మిత్రుడు అర్జునునివలె శరణుజొచ్చిన వారందరికీ జీవిత సమరంలో రథ సారధి కాగలడు భగవంతుడు మనతోనే మనసేవ చేస్తువున్నాడు. "భగవంతుడు నీకు దూరంగా ఎక్కడోలేడు నీలోవున్నాడు నీకు ముందుగావున్నాడు. నీవెనుక వున్నాడు పిలుస్తున్నాడు దోవచూపుతున్నాడు రక్షిస్తున్నాడు హెచ్చరిస్తున్నాడు చెబుతున్నాడు నీలో అంతర్యామిగా నీతో మాట్లాడు తున్నాడు. నీవు అతనికోసం వెతికే అవసరంలేదు అతడే నీప్రక్కనే సర్వదా సంసిద్ధుడైవున్నాడు. అంటూ భగవాన్ బాబా విస్పష్టంగా చెబుతున్నారు. ఈ భావాలు మన సాధనను బలపరచుగాక అనంత కృపాసాగరుడైన భగవాన్ ఆ దివ్యమైన వైభవాన్ని తిలకించే దృష్టిని మనకు ప్రసాదించుగాక !

## పుస్తకములు

| | పేరు | వెల | తపాలా ఛార్జి |
|---|---|---|---|
| | అద్భుత మూర్తి-(హవార్డ్ మర్ఫేట్ ఆంధ్ర అనువాదం-అమరేంద్ర) | 6-00 | 0-10 |
| 2 | రామకథా రసవాహిని | 9-00 | 0-60 |
| 3. | గీతావాహిని | 3-50 | 0-30 |
| 4. | జ్ఞానవాహిని | 1-50 | 0-10 |
| 5. | సత్యం శివం సుందరం (1) | 5-00 | 0-30 |
| 6 | సత్యం శివం సుందరం (2) | 5-00 | 0-2 |
| 7. | సత్యం శివం సుందరం (3) | 5-00 | 0-25 |
| | శ్రీ సత్యసాయి భగవల్లీల (ఉప్పాడ రాజారావు) | 1-50 | 0-15 |
| 9. | సూక్తి రసతరంగిణి (ఉప్పాడ రాజారావు) | 2-00 | 0-25 |
| 10. | శ్రీ సత్యసాయీశ్వర నుతి తరంగిణి (1) (ఉప్పాడ రాజారావు) | 3-00 | 0-2 |
| 11. | శ్రీ సత్య సాయీశ్వర నుతి తరంగిణి (2) (ఉప్పాడ రాజారావు) | 2-00 | 0-25 |
| 12. | సుధాబిందువులు | 5-00 | 0-30 |
| 13. | సువర్ణ సుమమాల | 5-00 | 0-30 |
| 14. | సత్యసాయి వచనామృతం (2) | 4-00 | 0-25 |
| 15. | భజనావళి | 2-00 | 0-20 |
| 16. | భాగవతవాహిని | 3-00 | 0-25 |

ఆంధ్ర రాష్ట్రపు, హైదరాబాదులోని ప్రోగ్రెసివ్ ప్రెస్ ప్రయివేట్ లిమిటెడ్ యందు, బి. వి. సత్యమూర్తిచే ముద్రింపబడి, యన్. కస్తూరిచే, శ్రీ సత్యసాయి ఎడ్యుకేషన్ అండ్ పబ్లికేషన్ ఫౌండేషన్, ప్రశాంతి నిలయం ప్రచురింపబడినది. ఎడిటర్ : యన్. కస్తూరి, యం. యే., బి. యల్.

# శ్రీసత్యసాయి ఎడ్యుకేషన్ అండ్ పబ్లికేషన్ ఫౌండేషన్, ప్రశాంతి నిలయం,

అనంతపురం జిల్లా. ఆంధ్రప్రదేశ్. పిన్ నం. 515134

## పత్రికలు / పుస్తకములకు ఆర్డర్లు.

**A** (1) పత్రికలు : ఒక సం॥కు తక్కువ కానీ 5 సం॥ల కెక్కువ కానీ స్వీకరింప బడవు.

| ఇండియా | | | వార్షిక చందా |
|---|---|---|---|
| మాస పత్రిక | సనాతన సారథి | ఇంగ్లీషు | 6 రూ. |
| మాస పత్రిక | సనాతన సారథి | తెలుగు | 6 రూ. |
| త్రైమాసిక పత్రిక | సేవాదళ్ | ఇంగ్లీషు | 4 రూ. |
| త్రైమాసిక పత్రిక | శ్రీ సత్యసాయి బాలవికాస్ | ఇంగ్లీషు, హిందీ (ఒకే పత్రికలోనే) | 4 రూ. |

విదేశములు

| | సనాతనసారథి | | సేవాదళ్ | | బాలవికాస్ | |
|---|---|---|---|---|---|---|
| | సీమెయిల్ | ఏర్ మెయిల్ | సీమెయిల్ | ఏర్ మెయిల్ | సీమెయిల్ | ఏర్ మెయిల్ |
| | రూ. | రూ. | రూ. | రూ. | రూ. | రూ. |
| ఆఫ్ఘానిస్థాన్ | .16 | 26 | 9 | 12 | 9 | 12 |
| ఆఫ్రికా | 16 | 46 | 9 | 18 | 9 | 18 |
| అమెరికా | 16 | 51 | 9 | 20 | 9 | 20 |
| ఆసియా ఖండపు దేశములు | 16 | 31 | 9 | 14 | 9 | 14 |
| ఆస్ట్రేలియా | 16 | 46 | 9 | 20 | 9 | 20 |
| | 16 | 26 | 9 | 12 | 9 | 12 |
| యూరోప్ ఖండపు దేశములు | 16 | 46 | 9 | 18 | 9 | 18 |
| పసిఫిక్ సముద్ర ప్రదేశములు | 16 | 51 | 9 | 20 | 9 | 20 |
| | 8 | 21 | 8 | 10 | 8 | 10 |

(2) సనాతన సారథికి చందా పంపునపుడే ఏ భాషలో (తెలుగు, ఇంగ్లీషు) కావలెనో తెలుపవలెను. చందా గడువు పొడిగించు సమయమునందును, మీ అడ్రసు నందు మార్పు అవసరమని తెలుపు సమయమునందును చందా నంబరును వ్రాసి పంపవలెను.

**B**(1) **పుస్తకములు :** ప్రస్తుతము మా యొద్ద నున్న పుస్తకములు, వాటి వెలలు, ఇండియాలోని వాటి పోస్టు ఛార్జీలును క్రింద తెలియజేయబడినవి. రిజిస్టర్డ్ పోస్టులో మాత్రమే పుస్తకములు పంపబడును. కాన, రిజిస్టర్ ఛార్జీ రూ. 2-25 లు మీ ఆర్డర్‌తో పంపవలసియున్నది. **V.P.P.** ద్వారా పంపబడవు.

(2) పుస్తకముల పూర్తి పేర్లు అవి ఏ భాషలో కావలయును అనునది స్పష్టముగా ఆర్డర్‌లోనే తెలుపవలెను.

(3) ఫోటోలు/చిత్రములు పోస్టులో పంపుటకు వీలు కాదు.

(4) కార్యాలయము నుంచి వివరములు తెలుసుకోవలెనన్న మీ చిరునామా గల స్టాంపు వేసిన కవరును పంపవలెను.

(5) పుస్తకముల ఆర్డర్లు—విదేశములనుంచి తపాలా ఛార్జీలు ఎంత అని ముందుగనే వ్రాసి తెలుసుకోవలెను.

(6) చందా మొత్తము కానీ, పుస్తకములకొరకు పైకము కానీ, శ్రీ సత్యసాయి ఎడ్యుకేషన్ అండ్ పబ్లికేషన్ ఫౌండేషన్ యొక్క చిరునామాకే పంపవలెను. మనియార్డర్ పంపువారు వెనుక భాగమందు తమ చిరునామాను పూర్తి వివరములతో స్పష్టముగా వ్రాయవలెను.

( పుస్తక సూచి : 168 వ పుటలో చూడండి )

మానవుడు కర్మ, భక్తి, జ్ఞానమనేటటువంటి త్రిమూర్తి స్వరూపాన్ని ధరించి వుంటున్నాడు. త్రిగుణాత్మకమైనటువంటి స్వరూపుడు ఈ మానవుడు ఇట్టి త్రిగుణాత్మకమయిన మానవతత్వము కర్మ ద్వారా పవిత్రము కావించి భక్తిద్వారా శాంతము నలవరచుకొని తద్వారా జ్ఞానమనే గమ్యమును చేరడము దీనియొక్క ప్రధాన లక్ష్యము. దేహము ద్వారా పవిత్రమైన కర్మలు ఆచరించి, సమాజసేవలు సలిపి, సర్వులకును సరియైన సదుపాయములు అందించేటటువంటి సేవకావృత్తియందు ఈ దేహమును అంకితము గావించటమే సరియైన సత్కర్మ.

—బాబా